# మనవి మాట

రాజ్య ప్రణాళికలోని జిల్లావారీ వివరాలు చూపే జిల్లా ప్రణాళికల వరసలో 1959–60 సంవత్సరానికి సంబంధించిన ఈ ప్రచురణ నాలుగవది. పుస్తకం మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం చేర్చబడింది. నేటివరకు సేకరించబడిన సమాచారం ఇందులో చేర్చబడింది. దానితోపాటు రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్య ప్రభుత్వం నాలుగవ సంవత్సరంలో నిర్వహించదలచిన కార్యక్రమస్వరూపం కూడ క్లుప్తంగా యివ్వబడింది. ఇక రెండవ భాగంలో తంతి, తపాలాశాఖ, రైలుమార్గాల అభివృద్ధితో సహా వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించి వివరింపబడింది. ఈ ప్రచురణ జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందని ఆశించబడడంవల్ల, దీనిని మెరుగుపరచేటందుకు జిల్లా పరిషత్తులు సూచనలు చేయగలవని ఆశించబడుతున్నది. సూచనలు ఎవరు పంపినా కృతజ్ఞతతో స్వీకరించబడతాయి. వాటిని హైదరాబాదులో ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రణాళికా శాఖ డిప్యూటి కార్యదర్శిగారికి పంపవచ్చును.

హైదరాబాదు
13–12–1959

సి. నరసింహం
ప్రభుత్వ ప్రణాళిక, స్థానిక
పరిపాలనా శాఖ కార్యదర్శి.

# విషయసూచిక

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం వివరాలు

ఈ జిల్లా విస్తీర్ణం 3,496 చదరపుమైళ్ళు. ఇందులో 4 రెవిన్యూ డివిజన్లు, 10 తాలూకాలు ఉన్నాయి. 1956-57 సంవత్సరంలో ఈ జిల్లాలోని భూమి క్రింది విధంగా వర్గీకరించబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం విస్తీర్ణంలో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 22,36,805 | — |
| అడవులుండే ప్రదేశం | 2,21,847 | 9.9 |
| బీడుభూమి, సాగు క్రిందకు రాని భూమి | 3,13,350 | 14.1 |
| వ్యవసాయేతర పనులకు ఉపయోగింపబడుతున్న భూమి | 1,06,101 | 4 7 |
| సాగుకు లాయకి అయిన బంజరు | 91,406 | 4.1 |
| శాశ్వత పచ్చిక బీళ్లు, ఇతర పచ్చిక బయళ్లు | 53,953 | 2 4 |
| సాగు చేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానారకాలచెట్లు, తోటలు పంటలు ఉండే భూమి | 36,986 | 1.7 |
| ప్రస్తుత బంజర్లు | 86,023 | 3.7 |
| ఇతర బంజర్లు | 28,500 | 1.3 |
| మొత్తం సాగు చేయబడే భూమి. | 12,98,639 | 58.1 |
| ఒకసారికి మించి సాగు చేయబడే భూమి | 2,23,066 | 10.0 |
| మొత్తం పంట భూమి | 15,21,705 | 69 0 |

## వేర్వేరు ఋతు పవనాల వల్ల వర్షపాతం

(అంగుళాలలో)

| | 1956–57 | 1955–56 | మామూలు |
|---|---|---|---|
| నైరుతి ఋతు పవనాలు | 33.9 | 25.9 | 24.1 |
| ఈశాన్య ఋతు పవనాలు | 17 | 15 0 | 9.8 |
| శీతాకాలం | — | — | 0.7 |
| వేసవికాలం | 3 | 4 2 | 2.7 |
| మొత్తం | 53.9 | 45.1 | 37.3 |

## *నీటిసరఫరా, నీటిపారుదల*

ఈ జిల్లాలో కృష్ణానది ప్రధాన నీటి పారుదల వనరు. విజయవాడ వద్ద నదికి అడ్డంగా డాం కట్టబడింది. దీనిద్వారా ఎగువ భాగంలో నదికి ఇరు ప్రక్కల ఉండేకాలవలకు నీరు వదలబడుతుంది. తూర్పువైపున ఉండేకాలవల వల్ల, వాటి శాఖల వల్ల కృష్ణాజిల్లాకు, పశ్చిమ గోదావరి జిల్లాలోని కొంత భాగానికి నీరు సరఫరా చేయబడుతుంది. పశ్చిమ భాగంలో ఉండే వాటి వల్ల గుంటూరు జిల్లాకు నీటి సరఫరా జరుగుతున్నది. నీటి పారుదల కోసం మునియేరు, బుడమేరు, తమ్మిలేరు నదులు కూడా వాడబడుతూఉన్నాయి. ఎగువ భూముల్లో నీటిపారుదల చెరువులు ఉన్నాయి. మెట్టపంటలకు తోటలకు ఎగువ భూముల్లో బావులు వాడ బడుతున్నాయి. మెట్ట పంటల నీటి పారుదల కోసం సముద్రతీర గ్రామాల్లో తత్కాలికంగా గోతులు త్రవ్వబడతాయి. కొల్లేరు సరస్సు, దానినుండి ప్రవహించే ఉప్పుటేరుతో కూడా నీటి పారుదల జరుగుతున్నది. 1956-57 లో ఈ జిల్లా లో ఉన్న నీటి పారుదల వనరులు వాటి వల్ల సాగయిన విస్తీర్ణం ఈ దిగువ తెలుపబడ్డాయి.

## *నీటివనర్లు*

| | |
|---|---|
| 1. ప్రభుత్వ కాలువలు | 11 |
| 2. ప్రయివేటు కాలువలు | — |
| 3. బావులు | |
| (ఎ) గొట్టపు బావులు | — |

(బి) నీటి పారుదలకొరకు మాత్రమే ఉపయో
గించబడే ఇతర బావులు —

(i) ప్రభుత్వంవారివి.

(ఎ) రాతికట్టడం గలవి 976
(బి) రాతికట్టడం లేనివి 204

(ii) ప్రయివేటు వ్యక్తులవి.

(ఎ) రాతికట్టడం గలవి. —
(బి) రాతికట్టడం లేనివి —

4. గృహకృత్యాలకు మాత్రము ఉపయో
గించబడుతున్న బావులు సంఖ్య 3,571
5, ఉపయోగంలో లేని బావులు సంఖ్య 20
6. రిజర్వాయర్లు —
7. చెరువులు —

(ఎ) నూరు ఎకరాలకన్నా ఎక్కువ ఆయకట్టు గలవి 156
(బి) నూరు ఎకరాలకన్నా తక్కువ ఆయకట్టు గలవి 498

*నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం*

1. ప్రభుత్వ కాలువల ద్వారా ... 6,21,432
2. ప్రయివేటు కాలువల ద్వారా ... —
3. చెరువులద్వారా ... 1,13,332
4. బావుల ద్వారా

(ఎ) కేవలం నీటిపారుదలకు ఉపయోగించ
బడేవి ... 14,669

(బి) ఇతర నీటి పారుదల వనరులకు
తోడ్పడేవి ... 1,920

(సి) ఇతర వనరులు (ఊటకాలువలు
మొదలయినవి) ... 19,342

5. నీటి పారుదల జరుగుచున్న మొత్తం భూమి ... 7,68,775

6. పంటపండే భూమిలో నీటి పారు
దల జరిగే నికరపు భూమి శాతం ... 59.2

| | | |
|---|---|---|
| 7. ఒకే సంవత్సరంలో ఒకసారికంటె ఎక్కువగా నీటిపారుదల జరిగే భూమి విస్తీర్ణం | ... | 53,963 |
| 8. నీటిపారుదలవల్ల పంటలు పండే మొత్తం భూమి విస్తీర్ణం | ... | 8,22,738 |
| 9. పంటభూమి మొత్తం విస్తీర్ణంలో నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం | ... | 54.0 |
| 10. స్వంత ఆయకట్లు ఉండే బావులు | ... | 620 |
| 11. గుర్తించబడిన నీటిపారుదల వనరులకు తోడ్పడే బావులు | ... | 172 |
| 12. నీటిపారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో స్వంత ఆయకట్లుండే బావులద్వారా నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం | ... | 0.2 |
| 13. ఆయిలు ఇంజన్ల సంఖ్య | ... | 161 |

## పంటలు

ఈ జిల్లాలో వరి ముఖ్యమైన పంట. జొన్న మెట్ట పంటగా పండింపబడుతున్నది. కుంబు, వరుగు, రాగి, మొక్కజొన్న పరిమితంగా పండింపబడుతున్నాయి, వేరుశనగ, పొగాకు ముఖ్యమైన వ్యాపారపంటలు.

1956—57 లో సాగుచేయబడిన భూమి, పండించబడిన పంటల వివరాలు క్రింద ఇవ్వబడినాయి.

| | విస్తీర్ణం (ఎకరాలలో) | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|
| I తృణధాన్యాలు. | | |
| 1. వరి | 7,78,348 | *3,79,100 |
| 2. గోధుమ | 47 | 10 |
| 3. జొన్న | 2,51,033 | 43,850 |
| 4. సజ్జ | 10,759 | 2,600 |
| 5. బార్లి | — | — |
| 6. మొక్కజొన్న | 3,851 | 1,700 |
| 7. రాగి | 2,145 | 960 |
| 8. కొఱ్ఱ | 997 | 300 |

*బియ్యం

| | | |
|---|---|---|
| 9. వరగు | 2,961 | 950 |
| 10. సామలు | 19 | — |
| 11. ఇతర తృణధాన్యాలు | 1,368 | 290 |
| మొత్తం తృణధాన్యాలు | 10,51,528 | 4,29,760 |
| **II పప్పు ధాన్యాలు** | | |
| 1. శనగలు | 3,295 | 700 |
| 2. పెసలు | 95,727 | 12,180 |
| 3. కందులు | 5,902 | 1,000 |
| 4 మినుములు | 40,974 | 6,950 |
| 5. ఉలవలు | 34,333 | 2 760 |
| 6. ఇతర పప్పుధాన్యాలు | 1,400 | 100 |
| మొత్తం పప్పు ధాన్యాలు | 1,81,631 | 23,690 |
| **III సంబారాలు** | | |
| 1. పోకచెక్కలు | — | — |
| 2. మిరపకాయలు | 9,145 | 4,850 |
| 3. అల్లం | — | — |
| 4. పసుపు | 5,531 | — |
| 5. వెల్లుల్లిపాయలు | 58 | — |
| 6. ధనియాలు | 5,586 | — |
| 7. చింతపండు | 34 | — |
| 8. ఇతర సంబారాలు | 1 | — |
| మొత్తం సంబారాలు | 20,355 | 4,850 |
| **IV చెక్కర పంటలు** | | |
| 1. చెరకు | 12,080 | 40,350 |

| | | |
|---|---|---|
| 2. తాటిబెల్లం | 462 | — |
| 3. ఇతరములు | — | — |
| మొత్తం చెక్కెరపంటలు | 12,542 | 40,350 |

V పండ్లు, కూరగాయలు

1. (ఎ) తాజాపండ్లు

| | | |
|---|---|---|
| (i) అరటిపండ్లు | 230 | — |
| (ii) నిమ్మజాతికిచెందిన పండ్లు | 513 | — |
| (iii) మామిడిపండ్లు | 28,239 | — |
| (Vi) ఇతర తాజాపండ్లు | 1,731 | — |
| మొత్తం తాజాపండ్లు | 30,713 | — |
| (బి) ఎండుపండ్లు | — | |
| మొత్తం ఎండుపండ్లు తాజాపండ్లు | 30,713 | — |

2. కూరగాయలు

| | | |
|---|---|---|
| (ఎ) బంగాళా దుంపలు | — | — |
| (బి) కర్రపెండలము | — | — |
| (సి) చిలగడ దుంపలు | — | — |
| (డి) ఉల్లిగడ్డలు | 700 | 2,450 |
| (ఇ) ఇతర కూరగాయలు | 5,950 | — |
| మొత్తం కూరగాయలు | 6,650 | 2,450 |
| మొత్తం పండ్లు, కూరగాయలు, దుంపపంటలతో సహా | 37,363 | — |

| | | |
|---|---|---|
| VI వివిధ రకాలకు చెందిన ఇతర ఆహార పంటలు | 2 | — |
| మొత్తం ఆహారపంటలు | 13,03,421 | — |

## ఆహారేతర పంటలు

| | | |
|---|---|---|
| I నారలు | | |
| 1. ప్రత్తి | 1,394 | 210 |
| 2. బొంబాయి జనుము | 1,585 | 3,760 |
| 3. జనుము | 19,627 | — |
| 4. ఇతర నారలు | 74 | — |
| మొత్తం నారలు | 22,680 | 3,970 |
| II నూనె విత్తనాలు | | |
| (ఏ) ఆహారంలో ఉపయోగించబడేవి | | |
| (i) వేరుశెనగ | 1,14,433 | 52,640 |
| (ii) కొబ్బరి | 864 | — |
| (iii) నువ్వులు | 4,313 | 610 |
| (iv) రేప్ విత్తనాలు, ఆవాలు | 31 | — |
| (v) కుసుమలు | — | — |
| (vi) ఇతరములు | 16 | — |
| మొత్తం | 1,19,657 | 53,250 |
| (బి) ఆహారంలో ఉపయోగించబడనివి. | | |
| (i) ఎల్లగిసె విత్తనాలు | 2 | — |
| (ii) ఆముదాలు | 540 | 60 |

| | | |
|---|---|---|
| (iii) నిగర్ విత్తనాలు | — | — |
| (vi) ఇతరములు | — | — |
| మొత్తం | 542 | 60 |
| మొత్తం నూనెవిత్తనాలు | 1,20,199 | — |
| III అద్దకం రంగులు, తోళ్ళ పరికరాలు | | |
| 1. నీలిమందు (అద్దకంకోసం) | 19 | — |
| 2. ఇతర అద్దకపు రంగులు. | 1 | — |
| మొత్తం అద్దకపు రంగులు. | 20 | — |
| IV మందులు, మత్తు పదార్థాలు. | | |
| 1. కాఫీ | — | — |
| 2. జనుము | — | — |
| 3. తమలపాకులు | 183 | — |
| 4. పొగాకు | 28,515 | 8,940 |
| 5. ఇతరమందులు, మత్తుపదార్థాలు | 237 | — |
| మొత్తం మందులు, మత్తు పదార్థాలు | 28,935 | 8,940 |
| V పశుగ్రాసపు పంటలు | | |
| VI పచ్చి ఎరువు పంటలు | 43,379 | — |
| 1. జనుము | — | — |
| 2. నీలిమందు | 161 | 10 |
| 3. ఇతరములు | 421 | — |
| మొత్తం పచ్చిఎరువు పంటలు | 582 | 10 |

| | | |
|---|---|---|
| VII | వివిధ ఆహారేతర పంటలు | 2,489 |
| i | మొత్తం ఆహారేతర పంటలు | 2,18,284 |
| ii | మొత్తం పంట భూమి | 15,21,705 |
| iii | ఒకసారికిమించి పంటపండే భూమి | 2,23,066 |
| iv | నికరపు పంటభూమి | 12,98,639 |

## స్థానిక పరిపాలన

30–9–58 తేదీనాటికి యీ జిల్లాలో విజయవాడ, మచిలీపట్టణం, గుడివాడలలో మూడు మున్సిపాలిటీలు, 333 పంచాయతీలు ఉన్నాయి.

## తపాలా ఆఫీసులు

1–4–1959 తేదీనాటికి ఈ జిల్లాలో 2 హెడ్ ఆఫీసులు, 78 సబ్–ఆఫీసులు, 381 బ్రాంచి ఆఫీసులు, 29 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 5 టెలిఫోను ఎక్స్ఛేంజీలు, 17 పబ్లిక్ కాల్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలుమార్గాలు

ఈ జిల్లాలో 55 మైళ్ళ బ్రాడుగేజి, 77¼ మైళ్ళ మీటరుగేజీ రైలు మార్గాలున్నాయి. మదరాసు–కలకత్తా, మదరాసు–ఢిల్లీ లైన్లు విజయవాడవద్ద చీలిపోతాయి. విజయవాడ–మచిలీపట్టణంమీద ఉన్న గుడివాడ నుండి పశ్చిమగోదావరి జిల్లాలోని నిడదవోలు–నర్సాపురం లైను మీదున్న భీమవరాన్ని కలుపుతూ మీటరుగేజి బ్రాంచి రైలు మార్గం ఒకటున్నది. విజయవాడ, కైకలూరు, బందరు తాలూకా గుండా రైలు మార్గాలున్నాయి. కాని ఇతర తాలూకాలలో రైలు మార్గాలు లేవు.

## రోడ్లు

ఈ జిల్లాలో 1,649 మైళ్ళరోడ్లు ఉన్నాయి. అవి క్రింది విధంగా వర్గీకరించబడినాయి.

| | | మైళ్ళు |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా ప్రభుత్వ రహదారుల శాఖచే నిర్వహించబడుతున్న రోడ్లు. ... | 522 |

| | | | |
|---|---|---|---|
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించబడుతున్నరోడ్లు | ... | 203 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించబడుతున్న రోడ్లు | ... | 924 |
| | మొత్తం | ... | 1,649 |

## సహకారం

30–6–1957 తేదీ నాటికి ఈ జిల్లాలో 30 రాజ్య మరియు కేంద్ర పరపతేతర సంఘాలు, 1284 వ్యవసాయ సహకార సంఘాలు, 151 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలో సభ్యుల సంఖ్య వరుసగా 3887, 178199, 24059.

## విద్య

1956-57 సం. లో ఈ జిల్లాలో ఉన్న విద్యాసంస్థల సంఖ్య క్రింద ఇవ్వబడింది :–

| | | | |
|---|---|---|---|
| 1. | ఉన్నతపాఠశాలలు | ... | 95 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు | ... | 8 |
| 3. | ప్రాథమిక పాఠశాలలు | ... | 2,032 |
| 4. | వయోజన విద్యాకేంద్రాలు | ... | 94 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తివిద్యా కేంద్రాలు | ... | 34 |
| 6. | కళాశాలలు | ... | 5 |
| | మొత్తం | ... | 2,268 |

## వైద్యం, ఆసుపత్రులు

1958-59 సం. లో ఈ జిల్లాలో 8 జనరలు ఆసుపత్రులు, 8 వైద్యశాలలు ప్రత్యేక చికిత్సకు మరొక ఆసుపత్రి ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

ప్లానింగు కమిషను ఉద్యోగులతోను, కేంద్రమంత్రాంగ శాఖల ఉద్యోగులతోను రాజ్య ప్రముఖోద్యోగులు సంప్రదింపులు జరిపిన తరువాత

రెండవ ప్రణాళిక యొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్ల మొత్తాన్ని ఖర్చు పెట్టడానికి నిర్ణయించబడింది. అయితే వివిధ విషయాలను పరిశీలించిన తరువాతను, ప్రణాళిక అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన రాజ్య సలహా సంఘం వారితో సమగ్ర చర్చలు జరిపిన అనంతరం రాజ్య ప్రభుత్వం వారు యీ సంవత్సరం ఖర్చు పెట్టదలచిన మొత్తాన్ని రు. 42.03 కోట్లకు పెంచటానికి నిర్ణయించారు. ఈ విధంగా కేటాయింపు మొత్తాన్ని హెచ్చించటానికి ముఖ్య కారణాలు ఏవంటే:

(i) ఈ సంవత్సరం కేటాయింపు మొత్తాన్ని హెచ్చు చేయక పోయినట్లయితే రెండవ ప్రణాళిక యొక్క ఆఖరి సంవత్సరంలో చేయవలసిన పనులు ఎక్కువగా మిగిలి పోతాయి.

(ii) ఎక్కువ చేయబడిన కేటాయింపు మొత్తాన్ని ఖర్చు పెట్టటానికి తగిన విధంగా రాజ్య పరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది.

(iii) ప్రస్తుతమున్న అదాయ మార్గాలను పూర్తిగా వినియోగించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది;

(VI) రాజ్య ప్రభుత్వం యొక్క అదాయ మార్గాలు కూడ ఈ పాటి ప్రణాళికను అమలు పరచటానికి తగినంతగా ఉన్నాయి.

ప్రతి అభివృద్ధి కార్యక్రమం క్రిందా ఎక్కువ చేయబడిన కేటాయింపు వివరాల్ని మొదటి పట్టికలో చూడవచ్చును.

ఈ సంవత్సరం ఖర్చు పెట్ట దలచిన మొత్తం యిదివరకటి సంవత్సరాల కంటే చాల ఎక్కువ. గత సంవత్సరం మొదట నిర్ణయించి తరువాత సవరించబడిన మొత్తాలకంటే యిది వరుసగా రు. 12 మరియు 7 కోట్లు ఎక్కువ. ప్రణాళిక యొక్క మొదటి నాలుగు సంవత్సరాల్లోను కేటాయించబడిన మొత్తం వివరాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

వివిధ విషయాల పద్దు క్రింద యివ్వబడిన కార్యక్రమాల కేటాయింపు విషయంలో చేయబడిన కొద్దిపాటి తగ్గింపు మినహామిగత అన్ని అభివృద్ధి కార్యక్రమాల క్రిందా కేటాయింపు మొత్తం అధికం చేయబడింది. అయితే 1958-59 సంవత్సరంతో పోల్చిచూస్తే కేటాయింపులో ఎక్కువ భాగం పరిశ్రమలకు, రవాణాకు, సాంఘిక కార్యక్రమాలకు ప్రత్యేకించ బడిన

విషయం విదితం కాగలదు. అయినప్పటికి వివిధ కార్యక్రమాలకు దాదాపుగత సంవత్సరంలో యివ్వబడిన క్రమంలోనే ప్రాధాన్యం యివ్వబడింది.

ఈ సంవత్సరం అమలు పరచటానికి ఉద్దేశింప బడిన పథకాలు, వాటికి కేటాయించబడిన ధనం, సాధించ దలచిన లక్ష్యాలను గురించి సమగ్ర వివరణలు రెండవ భాగంలో చూడ వచ్చును.

ఈ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి సంగ్రహంగా తెలపటం కోసం 1959–60 లో సాధించ దలచిన లక్ష్యాలను గురించిన వివరాలు ఈ క్రింద యివ్వబడినాయి,

కొన్ని లక్ష్యాల వివరాలు

| | పద్దు | యూనిట్లు | 1959–60 సంవత్సరపు లక్ష్యాలు |
|---|---|---|---|
| | వ్యవసాయం | | |
| 1. | ఆహారధాన్యాల ఉత్పత్తి | 000 టన్నులు | |
| (i) | పెద్దతరహా నీటిపారుదల పనులు | ,, | 190.60 |
| (ii) | చిన్న తరహా నీటిపారుదల పనులు | ,, | 38.70 |
| (iii) | భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| (iv) | ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 43.00 |
| (v) | మేలురకం విత్తనాలు | ,, | 21.00 |
| (vi) | సస్యరక్షణ | ,, | — |
| (vii) | పై కార్యక్రమాల క్రింద ఉత్పత్తికి వీలు కల్పించబడిన తరువాత మేలురకం వ్యవసాయ విధానాలు అవలంబించడానికి. | ,, | 89.60 |
| | | మొత్తం | 427.40 |
| | ఆహారేతర పంటలకు మార్చుటవల్ల తగ్గింపు | ,, | 11.30 |
| | | | 416.10 |

| | | |
|---|---|---|
| చిన్న తరహా నీటిపారుదల పనులు | 000 ఎకరాలు | వివరాలు అందు బాటులోలేవు |
| నీటిపారుదల కల్పించబడుతున్న భూమి విత్తనాల క్షేత్రాలు | సంఖ్య | 188 |
| (i) భూమి స్వాధీనం చేసుకోబడినట్టి వాటి సంఖ్య | — | — |
| (ii) వ్యవసాయ కార్యకలాపాలు ప్రారంభించబడిన వాటి సంఖ్య | — | — |
| (iii) విత్తనాల ఉత్పత్తిని ప్రారంభించిన వాటి సంఖ్య | — | — |
| ఎరువులు | | |
| (i) పట్టణాల్లో గోతి ఎరువు | 000 టన్నులు | 245.16 |
| (ii) గ్రామాల్లో గోతి ఎరువు | ,, | ప్రతి పంచాయతీలోను 75 టన్నులు. |
| (iii) పచ్చి ఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 టన్నులు | |
| (i) అమ్మోనియం సల్ఫేటు | ,, | 148.40 |
| (ii) సూపర్–ఫాస్ఫేటు | ,, | 47.60 |
| (iii) యూరియా | ,, | 19.50 |
| (iv) అమ్మోనియం నైట్రేటు | ,, | 27.50 |
| (v) కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |
| రాజ్య ప్రభుత్వంచే భూములలో స్థిరపరచబడే భూముల్లేని కుటుంబాలు | సంఖ్య | వివరాలు అందుబాటులో లేవు |

2. పశు సంవర్థన

| | | |
|---|---|---|
| కీలక గ్రామ పథకం | | |
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |

| | | |
|---|---|---|
| కీలక గ్రామ కేంద్రాలు | సంఖ్య | 66 |
| 3. సహకార సంఘాలు | | |
| చిన్నతరహా సంఘాలు | | |
| పటిష్ఠం చేయబడేవి. | ,, | 1,000 |
| కొత్తవి. | ,, | 1,000 |
| సహకార వ్యవసాయ సంఘాలు | ,, | 12 |
| సహకార వ్యవసాయ సంఘాలు | విస్తీర్ణం ఎకరాలలో | 3,376 |
| సహకార ఏజెన్సీల ద్వారా ఇవ్వబడే వ్యవసాయ ఋణం | రూపాయలు లక్షలలో (సంవత్సరానికి) | |
| స్వల్పకాలిక ఋణాలు | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| ధీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |
| 4. సామాజికాభివృద్ధి బ్లాకులు (జాతీయ విస్తరణ సేవా బ్లాకులతో సహా) | | |
| సంఖ్య | సంఖ్య మొదటి దశ బ్లాకులు | 26 |
| | రెండవ దశ బ్లాకులు | 20 |
| జనాభా | మిలియన్లు | 1.675 |
| ఉపయోగం పొందే గ్రామాల సంఖ్య | సంఖ్య | 1,600 |
| 5. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | | |
| సంభవమయ్యే అదనపు నీటిపారుదల | 000 ఎకరాలు | 418 |
| నీటిపారుదల జరిగే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| అదనపు ఇన్స్టలు కెపాసిటి | 000 కిలోవాట్లు | 29,750 |
| 33 కె. వి. కంటె శక్తివంతమైన ట్రాన్స్ మిషన్ లైన్లు | మైళ్ళు | 290 |
| 33. కె. వి అంతకంటె తక్కువ శక్తివంతమైన ట్రాన్స్ మిషను లైన్లు | మైళ్ళు | 400 |
| విద్యుతీకరణం చేయబడిన పట్టణాలు, గ్రామాలు | సంఖ్య | 200 |

7. వరద నివారణ

| | | |
|---|---|---|
| అదనంగా రక్షణకల్పించబడే భూమి | 000 ఎకరాలు | 48 |

8. రోడ్లు

| | | |
|---|---|---|
| నిర్మించబడే కంకరరోడ్లు | మైళ్ళు | 29.4 |

9. విద్య

| సంస్థలు | సంఖ్య | |
|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నత పాఠశాలలు | ,, | 18 |
| హైయ్యరు సెకండరీపాఠశాలలు | ,, | 10 |
| బహుళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్యడిగ్రీ/ డిప్లొమా | ,, | — |
| వివిధ తరగతుల్లో చేర్చుకోబడే విద్యార్థుల సంఖ్య | ,, డిప్లొమా | 1,150 |
| | ,, డిగ్రీ | 360 |

| | | |
|---|---|---|
| I వ తరగతి నుండి V వ తరగతి వరకు | సంఖ్య | 50,000 |
| VI వ తరగతి నుండి VIII వ తరగతి వరకు | ,, | 20,910 |
| IX వ తరగతి నుండి XI వ తరగతి వరకు | ,, | 6,900 |
| ఉపాధ్యాయులకు శిక్షణ శిక్షణ పాఠశాలలలో (బేసిక్, నాన్ బేసిక్ కలుపుకొని) చేర్చుకోబడే వారి సంఖ్య | ,, | 2,250 |
| శిక్షణ కళాశాలల్లో (బేసిక్, నాన్ బేసిక్ కలుపుకొని) చేర్చుకోబడేవారి సంఖ్య | ,, | 200 |

10. ఆరోగ్యం

| | | |
|---|---|---|
| ఆరోగ్య కేంద్రాలు | సంఖ్య | |
| సామాజిక కాభివృద్ధి కార్యక్రమం క్రింద ఇతర కార్యక్రమాల క్రింద | ,, | 20 |
| కుటుంబ నియంత్రణ కేంద్రాల సంఖ్య | | |
| (i) పట్టణ కేంద్రాలు | ,, | 15 |
| (ii) గ్రామీణ కేంద్రాలు | ,, | 44 |
| శిక్షణ సౌకర్యాలు | | |
| (i) డాక్టర్లు | ,, | 450 |
| (ii) నర్సులు | ,, | 120 |
| (iii) దాయీలు | ,, | 720 |
| (iv) సహాయక నర్సు–మంత్రసానులు | ,, | 90 |
| (v) మంత్రసానులు | ,, | 158 |

| | | | |
|---|---|---|---|
| | శిక్షణ సౌకర్యాలు | | |
| | (i) డాక్టర్లు | ,, | 450 |
| | (ii) నర్సులు | ,, | 120 |
| | (iii) దాయీలు | ,, | 720 |
| | (iv) సహాయక నర్సు-మంత్రసానులు | ,, | 90 |
| | (v) మంత్రసానులు | ,, | 158 |
| 11. | గృహవసతి. | | |
| | పారిశ్రామిక గృహనిర్మాణం | | |
| | నిర్మించబడిన యూనిట్లు | సంఖ్య | 1,365 |
| | తక్కువ ఆదాయం గలవారికి గృహనిర్మాణం | | |
| | నిర్మించబడిన యూనిట్లు | ,, ఆర్.సి.ఎస్. | 680 |
| | | ,, డి.టి.పి. | 180 |
| 12. | కార్మికులు-కార్మిక సంక్షేమం | | |
| | వృత్తిపనివారికి శిక్షణ | ,, | వివరాలు అందుబాటులో లేవు. |
| | శిక్షణ కేంద్రాలు | ,, | — |
| | శిక్షణ ఇవ్వబడిన వారి సంఖ్య | ,, | 1,816 |
| 13. | వెనుకబడిన తరగతులవారి సంక్షేమం. | | |
| | షెడ్యూల్డు తెగలు. | | |
| | స్కాలరుషిప్పులు | ,, | 2,465 |
| | సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 637 |
| | తెరవబడిన వైద్యాలయాలు | ,, | — |
| | నిర్మించబడిన రోడ్లు | మైళ్లు | 78 |
| | షెడ్యూల్డు తెగలు | | |
| | స్కాలరుషిప్పులు | సంఖ్య | 4,900 |
| | సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 850 |
| | విముక్త జాతులు | | |
| | స్కాలరుషిప్పులు | ,, | — |
| | పునరావాసం కల్పించబడిన కుటుంబాలు | ,, | 275 |
| | ఇతర వెనుకబడిన తరగతులు | | |
| | స్కాలరుషిప్పులు | ,, | 5,730 |
| | సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | — |

## మొదటిపట్టిక

### 1959–60 సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు

(రూపాయలు, లక్షలలో)

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం వివరం | 1959–60 లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపులో శాతం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | వ్యవసాయ కార్యక్రమాలు | 687.142 | 373.080 | 1,060.222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్న తరహా నీటిపారుదల పనులు. | 105.81 | 69.19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.300 | — | 5.300 | 0.13 |
| 4. | పశుసంవర్ధన | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడి పరిశ్రమ-పాల సరఫరా | 12.550 | 15.940 | 28.490 | 0.68 |
| 6. | అడవులు | 16.520 | 21.720 | 38.240 | 0.91 |
| 7. | భూసార రక్షణ | 13.810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు, మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | సామాజికాభివృద్ధి, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు | 240.850 | 119.150 | 360.000 | 8.57 |
| 12. | పంచాయతీలను పటిష్ఠం చేయడం | 5.450 | 5.450 | 10.900 | 0.26 |
| | *నీటిపారుదల, విద్యుచ్ఛక్తి* | 994.960 | 711.090 | 1,706.050 | 40.60 |
| 13. | బహుళార్థసాధక ప్రాజెక్టులు | 445.000 | 255.000 | 700.000 | 16.66 |
| 14. | పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు | 242.470 | 265.220 | 507.690 | 12.08 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15. | విద్యుచ్ఛక్తి | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| | పరిశ్రమలు | 219.720 | 75.410 | 295.130 | 7.02 |
| 16. | పెద్ద తరహా మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | — | 83.850 | 1.99 |
| 17. | గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. | చేనేత పరిశ్రమలు | 47.120 | 20.780 | 67.900 | 1.62 |
| | రవాణా | 145.920 | 64.430 | 210.350 | 5.01 |
| 19. | రోడ్లు | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20. | రోడ్డు రవాణా | 29.830 | — | 29.830 | 0.71 |
| | సాంఘిక కార్యక్రమాలు | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. | విద్య | 188.670 | 134.610 | 323.280 | 7.69 |
| 22. | వైద్యం | 88.060 | 61.940 | 150.000 | 3.57 |
| 23. | ప్రజారోగ్యం | 46.540 | 30.390 | 76.930 | 1.83 |
| 24. | గ్రామీణ, పట్టణ నీటిసరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.18 |
| 25. | గృహనిర్మాణం | 46.17 | 66.08 | 112.250 | 2.67 |
| 26. | కార్మికులు, కార్మికసంక్షేమం | 16.510 | 14.050 | 30.560 | 0.73 |
| 27. | వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. | షెడ్యూల్డు తెగల సంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 29. | స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. | సాంఘిక సంక్షేమం | 19.500 | — | 19.500 | 0.46 |
| | వివిధ విషయాలు | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. | రాజధాని అభివృద్ధి | 20.000 | — | 20.000 | 0.48 |
| 32. | మునిసిపలు రోడ్లు, అభివృద్ధి పనులు | 11.590 | — | 11.590 | 0.28 |
| 33. | రేడియో ప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0.15 |
| 34. | ప్రచారం | 3.760 | 3.040 | 6.800 | 0.16 |
| 35. | అర్థగణాంక శాఖ | 9.040 | — | 9.040 | 0.21 |
| | మొత్తం | 2,611.972 | 1,590.546 | 4,202.518 | 100.00 |

# వ్యవసాయోత్పత్తి

## మేలురకం విత్తనాల అభివృద్ధి, పంపకం
## (విత్తనాల క్షేత్రాలు, విత్తనాల స్టోర్లు)

వ్యవసాయోత్పత్తిని ఎక్కువచేసే ఉద్దేశంతో ప్రతిబ్లాకులోను ఒక విత్తనాల క్షేత్రాన్ని ఏర్పాటు చేయడానికి ఒక విత్తనాల స్టోరును నిర్మించడానికి సంబంధించిన ఒక పథకం భారత ప్రభుత్వం వారి ప్రోద్బలంతో ప్రారంభించబడింది ప్రాథమిక విత్తనాల క్షేత్రాలను నిర్వహించటంకోసం రిజిస్టరైన ఉత్పత్తిదారులకు పంపకం చేసేటందుకు భారీ ఎత్తున మూల విత్తనాలను ఉత్పత్తిచేసేటందుకు ఈ విత్తనాల క్షేత్రాలు ఉపయోగపడతాయి. రిజిస్టరైన ఉత్పత్తిదారులు తమ పొలాలలో మేలురకం విత్తనాలను వ్యవసాయ శాఖవారి కట్టుదిట్టమైన పర్యవేక్షణ క్రింద ఉత్పత్తిచేస్తారు. ఇందులో సగం విత్తనాలు వీరినుండి సేకరించబడి, రైతులకు సరఫరా చేయటంకోసం వివిధ విత్తనాల స్టోరుల్లో నిల్వ చేయబడతాయి. ఈ సంవత్సరలో 129 విత్తనాల క్షేత్రాలను, 129 విత్తనాల స్టోరులను ఆంధ్రప్రాంతంలో నెలకొల్పడానికి ప్రణాళికలో రు. 42.29 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.37 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ మొత్తంతో 8 విత్తనాల క్షేత్రాలు, 8 విత్తనాల స్టోరులు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడతాయి.

## తగ్గింపు ధరలకు విత్తనాల పంపకం

ఈ పథకంక్రింద మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, కాయ ధాన్యాల విత్తనాలు రిజిస్టరైన ఉత్పత్తిదారుల నుండి కొనుగోలు చేయబడి తగ్గింపు రేట్లకు వ్యవసాయదారులకు పంపిణీ చేయబడతాయి. వరి మణుగు ఒక్కింటికి రు. 2/- చొప్పున, గోధుమ, మొక్కజొన్న మణుగు ఒక్కింటికి రు. 1/- చొప్పున ఆతగ్గింపు రేట్లుంటాయి. ఈ పథకం, తెలంగాణా ప్రాంతంలో 1956-57 లగాయతు అమలు జరపబడుతున్నది. ఈ పథకం క్రింద చేకూరే లాభాలను ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తరింప చేయడానికి ఈ సంవత్సరంలో తలపెట్టబడింది. అందుకోసం 1959-60 ప్రణాళికలో రు. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 5.22 లక్షల మొత్తం ఆంధ్రప్రాంతంలో విత్తనాల పంపిణీకి, రు. 2.31 లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతంలో విత్త

నాల పంపిణీకి వినియోగించబడతాయి. ఈ పథకం వల్ల కలిగేలాభాలు ఈ జిల్లాలోని రైతులుకు కూడా చేకూరుతాయి.

## చీడల, తెగుళ్ళ నివారణ

పంటలకు చీడలు, తెగుళ్ళు పట్టకుండా నివారణ చర్యలు తీసికోవడానికి వ్యవసాయశాఖ డిపోలలోని సాధన సామగ్రిని పెంపు చేసేటందుకు స్ప్రేయర్లను, డస్టర్లను కొనటానికి యీ పథకం ఉద్దేశింపబడింది. ప్రతి జిల్లా కేంద్రంలోను నియమించబడిన ప్లాంటు ప్రొటెక్షను అసిస్టెంట్లకు సలహానిచ్చేటందుకు మైకాలజీకొకరు, ఎంటిమోలజీకి ఒకరు-మొత్తం ఇద్దరు ప్లాంటు ప్రొటెక్షను ఆఫీసర్లు నియమించబడ్డారు. 1957-58 లో మొబైల్ ప్లాంటు ప్రొటెక్షను సర్వీసు కూడా ప్రారంభించబడింది. ఇందుకు మొబైలు వానులు కూడ సరఫరా చేయబడ్డాయి. ప్రస్తుతం అవి ఆంధ్రప్రాంతంలో పని చేస్తున్నాయి. ఈ పథకం క్రింద నియమించబడిన సిబ్బందిని, మొబైలు ప్లాంటు ప్రొటెక్షన్ సర్వీసును కొనసాగించేటందుకు, 70 విద్యుచ్ఛక్తి స్ప్రేయర్లను, 500 చేతి డస్టర్లను కొనడానికి రు. 5.42 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయింపబడింది. అందులో రు. 0.49 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయింపబడింది.

## జిల్లా సర్వీసు స్టేషన్ల ఏర్పాటు

వ్యవసాయ శాఖవద్ద, రైతులవద్ద ఉన్న వ్యవసాయ యంత్రాలకు మరమ్మత్తులు చేయటానికి, తద్వారా ఉపయోగంలో లేకుండా మూల పడిన యంత్రాల సంఖ్య తగ్గించటానికిగాను జిల్లాలలో సర్వీసు స్టేషన్లను నెలకొల్పేటందుకు ప్రతిపాదింపబడింది. తదనుగుణంగా 1957-58 లో కాకినాడలో ఒకటి, 1958-59 లో చిత్తూరు, నెల్లూరు, నిజామాబాదు, వరంగల్లులలో నాలుగు - మొత్తం 5 సర్వీసు స్టేషన్లు నెలకొల్పబడినాయి. రు. 1.47 లక్షల వ్యయంతో యీ కేంద్రాలు యీ సంవత్సరం కొనసాగించబడతాయి. ఇందులో రు. 0.28 లక్ష చిత్తూరులోని కేంద్రం కోసం ప్రత్యేకించబడింది.

## అద్దె కొనుగోలు పద్ధతిమీద వ్యవసాయ పనిముట్ల పంపిణీ

చెరకు రసం తీసే యంత్రాలు, గట్లుపోసే యంత్రాలు, ధాన్యాన్ని నూర్చే యంత్రాలు, తూర్పారపోసే యంత్రాలు వంటి ఆధునిక వ్యవసాయ

పనిముట్లను నగదు చెల్లించి కొనుక్కోవడం సన్నకారు రైతులకు కష్టం. అందువల్ల అటువంటి పనిముట్లను కొని ఆంధ్ర ప్రాంతంలోని అవసరమున్న సన్నకారు రైతులకు అద్దె కొనుగోలు పద్ధతి మీద పంపిణీ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పనిముట్లు ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటారు సెట్లు మాదిరిగానే ఇవ్వబడతాయి. వ్యక్తిగత పూచీమీద ప్రతి రైతుకు పనిముట్ల రూపంలో రు. 800/– ల గరిష్ఠ పరిమితి వరకు ఋణం ఇవ్వబడుతుంది. దీనిమీద నూటికి రు. 4 వడ్డీ వసూలు చేయబడుతుంది. ఈ మొత్తం 4 సమాన వాయిదాలలో వసూలు చేయబడుతుంది. ఈ పథకం 1957–58, 1958–59 సంవత్సరాలలో అమలు జరపబడింది. ఈ సంవత్సరం కూడా కొనసాగించబడుతుంది. అందుకు రు. 1.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.07 లక్ష మొత్తం ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

## పట్టణాలలో గోతి ఎరువు తయారీ, పంపకం

గోతి ఎరువును ఎక్కువగా తయారు చేసి, పంపకం చేయడంకోసం మున్సిపాలిటీలకు, మేజరు పంచాయతీలకు ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి. ఆంధ్రప్రాంతంలోని స్థానిక సంస్థలకు ఋణాలు ఇవ్వడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3 00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్థానిక సంస్థలకు కూడా ఋణసహాయం లభ్యమౌతుంది. 10,000 టన్నుల ఎరువు యీ జిల్లాలో ఉత్పత్తి చేయబడి రైతులకు పంపిణీ చేయబడుతుందని ఆశించబడుతున్నది. ఇది 2,000 ఎకరాల్లో ఉపయోగించబడుతుందని, ఇందుమూలంగా అదనంగా 250 టన్నుల పంట పండుతుందని కూడ ఆశించబడుతున్నది.

## స్థానికంగా లభ్యమయ్యే చెత్త చెదారంతో ఎరువు తయారి

గ్రామాలలో ప్రస్తుతం ఉత్పత్తి చేయబడుతున్న ఎరువు పరిమాణాన్ని అధికం చేయడమే ఈ పథకంయొక్క ఉద్దేశం. స్థానికంగా లభ్యమయ్యే చెత్తా చెదారాలను నిలవచేసి ఆధునిక పద్ధతులమీద గోతి ఎరువును తయారు చేయడంజరుగుతుంది. మొదట్లో ఈ పథకాన్ని బ్లాకు ప్రాంతాల్లో అమలు పరచి, తరువాత రెండవప్రణాళిక ఆఖరయ్యేసరికి రాజ్యం అంతా విస్తరింప చేయడానికి ఉద్దేశింపబడింది. 1957–58, 1958–59 సంవత్సరాలలో రాజ్యంలోని 56 బ్లాకులలో ఈ పథకం అమలు పరచబడింది. స్థానికంగా లభ్య

మయ్యో చెత్తా చెదారంతో ఎరువును తయారు చేసుకోవడానికిగల విధానాలలో 12,565 మంది వ్యవసాయదారులకు శిక్షణ ఇవ్వబడింది. ఇద్దరు ఫీల్డుమెన్యూరియల్ ఆఫీసర్లు, 20 మంది కంపోస్టు ఇన్‌స్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమన్లు, ఒక అప్పర్ డివిజన్ గుమాస్తా, ఇద్దరు లోయరు డివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, 4 గురు జవానులతో కూడిన ప్రత్యేక సిబ్బంది ఈ పథకం క్రింద నియమించబడింది. పై సిబ్బందిని కొనసాగించడానికి, మరో 30 బ్లాకులకు ఈ పథకాన్ని విస్తరింప చేయడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ 47 బ్లాకులలో 30 ఆంధ్రప్రాంతంలోను, 17 తెలంగాణా ప్రాంతంలోను ఉంటాయి. సుమారు 13,000 మంది వ్యవసాయదారులకు ఈ సంవత్సరం శిక్షణ ఇవ్వబడుతుందని ఆశించబడుతున్నది. ఈ సంవత్సరంలో ఈ పథకం చిత్తూరు, చౌడేపల్లి, నరసింగరాయనిపేట బ్లాకులకు విస్తరింప చేయబడుతుంది. ఈ జిల్లాలోని రైతులకు కూడా ఈ పథకంవల్ల లాభం చేకూరుతుంది.

## చేతి స్ప్రేయర్లు, చేతి డస్టర్లు తగ్గింపు ధరలకు పంపిణీ

పంటలకు పెద్ద పెట్టున చీడలు పట్టినప్పుడు సాధ్యమైనంత త్వరలో సస్య రక్షణ చర్యలు తీసికొనేటందుకు తమకు కావలసినన్ని స్ప్రేయర్లను డస్టర్లను వ్యవసాయదారులు, సహకార సంస్థలు, పంచాయతీలు మొదలైనవి కలిగియుండేటట్లు చేయడమే ఈ పథకం యొక్క ఆశయం. ఈ పరికరాలు అసలు ధరలో సగం ధరకు సరఫరా చేయబడతాయి. మిగిలిన సగం, రాజ్య, కేంద్ర ప్రభుత్వాలు భరిస్తాయి. 1958–59 లో 500 చేతి స్ప్రేయర్లు, డస్టర్లు కొనడానికి రు. 0.90 లక్ష మొత్తం మంజూరు చేయబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో మరి 500 స్ప్రేయర్లు, డస్టర్లను కొని సరఫరా చేయడానికి రు. 0.90 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో 25 స్ప్రేయర్లు, డస్టర్లు రు. 0.045 లక్ష వ్యయంతో ఈ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

## ఆంధ్రప్రదేశ్‌లో పండ్లతోటల అభివృద్ధి పథకం

ప్రస్తుతం పండ్లతోటలున్న ప్రాంతాన్ని విస్తరింప చేయడం, క్రొత్త ప్రాంతంలో పండ్లతోటలు వేయడం ద్వారా ఫలోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతోను, వ్యవసాయోత్పత్తిని బహుముఖంగా పెంపుచేయడానికిగాను ఫలోత్పత్తిని అభివృద్ధి చేయడానికి ప్లానింగు కమిషనువారు చేసిన సిఫా

రసులను పురస్కరించుకొని ఈ పథకం 1957-58 లో ప్రారంభించబడింది. ఈ పథకం క్రింద రైతులకు స్వల్పకాలిక ఋణాలు, దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. పాతతోటల్ని పునరుద్ధరించడానికి ఎకరానికి రు. 65/-లు చొప్పున స్వల్పకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. క్రొత్తగా పండ్లతోటల్ని వేసుకోడానికి దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఇవి ఎకరానికి రు. 150/- నుండి రు. 300/-ల వరకు ఇవ్వబడతాయి. 1957-58, 1958-59 సంవత్సరాలలో సుమారు రు. 11.00 లక్షల మొత్తం ఋణాలుగా పంపిణీ చేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 8.86 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రు. 1.36 లక్షల మొత్తం అవసరం ఏర్పడే జిల్లాలకు తిరిగి పంపిణీచేసే నిమిత్తం కడప జిల్లా, అనంతరాజుపేటలోని ఫ్రూట్ స్పెషలిస్టు వద్ద రిజర్వులో ఉంచబడింది. మిగత మొత్తంలో రు. 0.40 లక్ష మొత్తం ఈ పథకం క్రింద ఋణాలనిచ్చేటందుకుగాను ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

## ప్రత్తి విస్తరణ పథకం

బీడుభూముల్ని, బంజరు భూముల్ని బాగు చేయడం, ఆహారేతర పంటలను వేయడం, రెండు పంటలను పండించడం, పంటకీ పంటకీ మధ్య వేరొకపంట పండించడం, మేలురకపు విత్తనాలను పంచడం, రసాయనిక ఎరువులను వాడడం వంటి సాగు పద్ధతులను అవలంబించి రెండవ ప్రణాళికా కాలంలో బేలుకు 392 పౌనులుండే సుమారు 20,000 బేళ్ల ప్రత్తిని అదనంగా ఉత్పత్తి చేయడానికి ఈ పథకం క్రింద ఉద్దేశింపబడింది. మొదటి మూడు సంవత్సరాలలో ఉత్పత్తి 12,000 బేళ్లకు పెరిగింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 1.40 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తం ఈ దిగువ తెలుపబడిన ఉద్యోగుల క్రింద ఉంచబడుతుంది. వారు ఈ పథకం మీద అజ్మాయిషీ వహిస్తారు. వీరే విత్తనాలు మొదలైన వాటిని కొని పంపకం చేస్తారు.

| | | | రూపాయలు లక్షలలో |
|---|---|---|---|
| 1. కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయశాఖ డైరెక్టరేటు. | ... | ... | 0.9190 |

| | | | |
|---|---|---|---|
| 2. | అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, అదిలాబాదు. | ... ... | 0.1495 |
| 3. | అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, కడప. | ... ... | 0.1743 |
| 4. | అసిస్టెంటు కాటన్ ఎక్స్టెన్షన్ ఆఫీసరు, గుంటూరు. | ... ... | 0.1572 |
| | | మొత్తం | 1.4000 |

ఈ జిల్లాలో 10 ఇంపీరియల్ మణుగుల ప్రత్తి గింజలు పంచబడతాయి. వీటివల్ల 50 ఎకరాలమేర ప్రత్తి పంట పండించబడుతుంది. తత్ఫలితంగా 25 బేళ్ళ ప్రత్తి ఉత్పత్తి అవుతుంది.

## చెరకు పంటకు ఎక్కువగా ఎరువు వేయడానికి సంబంధించిన పథకం

పంట దిగుబడి ఎక్కువ అయ్యేటందుకు చెరకు పంటకు ఎరువులను ఎక్కువగా వేయడాన్ని ప్రచారంలోకి తీసికొనిరావడమే ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ పథకం, 1958–59 చివర భాగంలో అమలు జరుపబడింది. ఆంధ్రలో 28, తెలంగాణాలో 12 మంది కాంగార్ల ద్వారా వివిధ కేంద్రాలలో ఈ పని జరపబడుతున్నది. ఈ పథకాన్ని 1959–60 లో కొనసాగించడానికి ఉద్దేశించబడింది. అందుకు రు. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయింప బడింది. ఈ జిల్లాలో చెరకు పండించే వ్యవసాయదారులకు కూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## ఆంధ్ర ప్రాంతంలో చెరకు అభివృద్ధి పథకం

అభివృద్ధి కార్యక్రమాన్ని తీవ్రంగా జరిపి చెరకుపంట దిగుబడిని, చెరకు రసం నాణ్యాన్ని అధికంచేసే ఉద్దేశంతో ఈ పథకం, చెరకు పండే శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా చిత్తూరు, అనంతపురం జిల్లాలలో 1956–57 లో అమలుపరచబడింది.

## ఆంధ్ర ప్రాంతంలో చెరకు అభివృద్ధి పథకం

అభివృద్ధి కార్యక్రమాన్ని తీవ్రంగా జరిపి చెరకుపంట దిగుబడిని, చెరకు రసం నాణ్యాన్ని అధిగించేసే ఉద్దేశంతో ఈ పథకం, చెరకు పండే శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా చిత్తూరు, అనంతపురం జిల్లాలలో 1956–57 లో అమలుపరచబడింది. రెండవ ప్రణాళిక చివరకు నూటికి 33 1/3 పంతులు చెరకు ఉత్పత్తిని పెంచడమే ఈ పథకం యొక్క ఆశయం. వీలున్నచోట మరికొన్ని క్రొత్త ప్రదేశాలలో చెరకుపంటను వేసికూడా అదనంగా చెరకు ఉత్పత్తి సాధించ బడుతుంది. ఈ పథకంపై జిల్లాలలోని 20 అభివృద్ధి కేంద్రాలలోను, 5 మండల కేంద్రాలలోను అమలులో ఉన్నది. ఇది ఈ సంవత్సరం కూడా కొనసాగించబడుతుంది. అందుకోసం ప్రణాళికలో రు. 3.07 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.36 లక్ష మొత్తం ఈ జిల్లాలో కార్యక్రమాన్ని కొనసాగించడానికి వినియోగించబడుతుంది.

## పొగాకు విస్తరణ కార్యక్రమం

మేలురకాల పొగాకును పండించేటందుకై వ్యవసాయపద్ధతులు, పదును పెట్టడం, రవాణా చేయడం మున్నగు విషయాలను గురించి ప్రదర్శన పూర్వకంగాను, ఇతర విధానాల ద్వారాను రైతులకు పరిజ్ఞానం కలిగించడం కోసం ఈ పథకం ప్రారంభించబడింది. ఇది 1956–57 లో కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో అమలుపరచబడింది. ఇందుకై నియమించబడిన విస్తరణ సిబ్బందిలో 1 అసిస్టెంటు టొబాకో ఎక్స్టెన్షన్ ఆఫీసరు, 12 మంది ఫీల్డు అసిస్టెంట్లు, 1 హెడ్ గుమాస్తా, ఒక లోయరు డివిజను గుమాస్తా, 1 టైపిస్టు, 36 మంది మేస్త్రీలు, ముగ్గురు జవాన్లు, ఒక జీపుడ్రైవరు ఉన్నారు. ఈ పథకం 1957–59 లలో కొనసాగించబడింది. ఈ సంవత్సరం కూడా ఇది కొనసాగించబడుతుంది. అందుకోసం రు. 0.77 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.26 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## జీడిగింజల అభివృద్ధి

ఈ రాజ్యంలో విస్తారంగా బంజరు భూముల్లో జీడితోటలు వేసే ఉద్దేశంతో క్రొత్తగా ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో జీడిగింజలను నాటడానికిగాను

15,000 పౌనుల మంచి రకం జీడిగింజలు పోగుచేయడానికి తలపెట్టబడింది. జీడితోటలను విస్తరింపచేయడానికి తగు ప్రాంతాలను ఎంపిక చేయడంకోసం శ్రీకాకుళం, తూర్పు గోదావరి, గుంటూరు జిల్లాలలోని ప్రాంతాలను సర్వే చేయడానికి తలపెట్టబడింది. అదనంగా మరికొన్ని ప్రాంతాలలో జీడితోటల్ని వేయడానికి రైతులకు వీలుకలిగించే నిమిత్తం ఎకరానికి రు. 100/– లు చొప్పున రైతులకు ఋణాలు యీ పథకం క్రింద మంజూరు చేయబడతాయి.

ఒక క్యాషునట్ డెవలప్‌మెంటు ఆఫీసరును, 4 గురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తాను, 5 గురు జవానులను నియమించటం ద్వారా 1958—59 లో ఈ పథకం అమలు పరచబడింది. 3,000 ఎకరాల మేర జీడితోటలు వేయడానికి ఋణాలు ఇవ్వబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకాన్ని కొనసాగించడానికి, 6,000 ఎకరాల మేర జీడితోటల్ని వేయడానికి గాను రు. 6.11 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో జిల్లాల అదనపు అవసరాలు ఏవైనా ఉంటే వాటికోసం హెడ్ క్వార్టర్సులో రు. 0.12 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. సిబ్బందికయ్యే ఖర్చులు మొదలగు వాటికోసం రు. 0.11 లక్ష మొత్తం కేటాయించబడింది. మిగిలిన మొత్తంలో రు. 0.18 లక్ష 180 ఎకరాల మేర జీడితోటల్ని వేయడానికి గాను ఈ జిల్లాలో ఋణాల రూపంలో పంచబడుతుంది.

*చీడలు, తెగుళ్ళ నుండి చెరకు పంటకు రక్షణ*

చెరకుకు పట్టే తెగుళ్ళలో మొగ్గ కొరుకుడు, కాటుక తెగులు ముఖ్యమైనవి. వీటిని అదుపులో పెట్టడానికి వెంటనే తగుచర్యలు తీసికోవడం అవసరం. అందువల్ల వెంటనే అటువంటి చర్య తీసికోవడానికి వీలుగా, ప్రతి మండల కేంద్రానికి రెండు విద్యుత్ స్ప్రేయర్లను, డస్టర్లను ఇవ్వడానికి, ఇన్‌సెక్టిసైడల్, ఫంగిసైడల్ స్ప్రేయర్ల ఉపయోగాన్ని ప్రదర్శన పూర్వకంగా తెలయచెప్పడానికి ఉద్దేశింపబడింది. ఈ రసాయనిక మందులు తగ్గింపు ధరలకు సరఫరా చేయబడతాయి. ఈ పథకం 1957—58 లో ప్రారంభించబడింది. ఇది 1959—60 లో కొనసాగించబడుతుంది. అందుకోసం ప్రణాళికలో రు. 0.24 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ పథకం అమలుజరుపబడుతున్న 7 జిల్లాలలోను 15800 ఎకరాల మేర ఈ కార్యక్రమం అమలు జరుపబడుతుంది. ఇందులో రు. 0.024 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. 1580 ఎకరాల మేర ఈ కార్యక్రమం అమలుజరపబడుతుంది.

## నూనెగింజల అభివృద్ధి పథకం

నూనెగింజల ఉత్పత్తిని అధికం చేయడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద మేలురకం విత్తనాలను వాడడంలోను, తగినంత ఎరువును వేయడంలోను, సస్య రక్షణ చర్యలను తీసికోవడంలోను తీవ్రమైన ప్రచారం చేయబడుతుంది. ప్రదర్శన పూర్వకంగా కూడ రైతులకు వివరించబడుతుంది. ఒక పైరుకు మరొక పైరుకు మధ్య ఈ పంటలను పండించే విషయమై కూడ ప్రచారం చేయడం, ప్రదర్శన పూర్వకంగా వివరించడం జరుగుతుంది.

రాజేంద్రనగర్‌లోని ఆయిలు సీడ్సు స్పెషలిస్టు పర్యవేక్షణ క్రింద ఆంధ్ర జిల్లాలు తొమ్మిదింటిలోను, తెలంగాణా జిల్లాలు అయిదింటిలోను 1958–59 లో ఈ పథకం అమలు జరుపబడింది. 1958–59 లో ఈ క్రింద తెలుపబడిన సిబ్బంది కూడా నియమించబడింది.

| | |
|---|---|
| అసిస్టెంటు ఆయిల్ సీడ్సు డెవలెప్‌మెంటు ఆఫీసర్లు | 2 |
| అసిస్టెంట్లు | 11 |
| ఫీల్డు మెన్లు | 22 |
| అప్పర్ డివిజను గుమాస్తాలు | 4 |
| లోయరు డివిజను గుమాస్తాలు | 16 |
| టైపిస్టులు | 3 |
| జీపు డ్రైవర్లు | 2 |
| జవానులు | 17 |
| వాచ్ మెన్లు | 2 |

ఈ పథకాన్ని 1959–60 లో కొనసాగించడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.71 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకం క్రింద లాభం చేకూరే 14 జిల్లాలలో ఈ జిల్లా ఒకటి.

## ఆయిలు ఇంజన్లకు సంబంధించి వ్యాపసాయదారులకు శిక్షణనిచ్చే పథకం

ఈ పథకం ప్రస్తుతం తెలంగాణాలో అమలు జరుపబడుతున్నది. ఆయిలు ఇంజన్లను నడపడంలోను, సరియైన పద్ధతుల్లో ఉంచుకోవడంలోను వ్యవసాయదారులకు శిక్షణ నిచ్చేటందుకు ఆంధ్రప్రాంతానికి 1958–59 లో యీ పథకం విస్తరింపచేయబడింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి, 420 మంది వ్యవసాయదారులకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు.0.16 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని రైతులు కూడా ఈ శిక్షణవల్ల లాభం పొందుతారు.

## సిబ్బందికి సంబంధించిన సమగ్ర పథకం

వ్యవసాయశాఖకు సంబంధించిన ప్రణాళికా పథకాలను కట్టుదిట్టంగా పర్యవేక్షించడానికి, విజయవంతంగా నిర్వహించడానికి ప్రధాన కార్యాలయంలోను, జిల్లాలలోను అదనంగా పర్యవేక్షక (సాంకేతిక సిబ్బందిని, మినిస్టీరియల్ సిబ్బందిని) నియమించడానికి తలపెట్టబడింది ఇది 1956–57 నుండి కొనసాగుతూ వస్తున్న పథకం. ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలోను నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి రు. 2.93 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. ఈ సంవత్సరంలో అదనపు సిబ్బంది నియమించబడదు. అందులో కొంత మొత్తం ఈ జిల్లాలో ఇదివరకు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించబడుతుంది.

## ఆంధ్రప్రాంతంలో క్రయ, విక్రయాలు

ఆంధ్రప్రాంతంలోని క్రయ విక్రయ వ్యవస్థను విస్తరింపజేసే ఉద్దేశంతో 1956–57 లో ఒక అసిస్టెంటు మార్కెటింగు ఆఫీసరు, ఒక మార్కెటింగు అసిస్టెంటు నియమించబడ్డారు. దీని ప్రధానకార్యాలయం విజయవాడలో ఉంటుంది. ఇది కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాలకు ఉపయోగపడుతుంది. దీనికితోడు హైదరాబాదులో ఉన్న హెడ్ ఆఫీసు లో ఒక మార్కెటింగు అసిస్టెంటు, ఒక అప్పర్ డివిజను

గుమాస్తా. ఒక టైపిస్టు, ఒక రికార్డరు నియమించబడ్డారు. ఈ సిబ్బందిని కొనసాగించడానికి రు 0.27 లక్ష మొత్తం 1959-60లో కేటాయించ బడింది.

## వ్యవసాయ పరిశోధనలు
## (సాదా ఎరువులు)
## ఆంధ్రప్రదేశ్

రెండవ ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి పూర్తికాగల నీటిపారుదల ప్రాజెక్టుల నుండి గరిష్ఠంగా లాభంపొందే ఉద్దేశంతో రాజ్యంలోని వివిధ రకాల నేలలలో పంటపండించడానికి ఎంతెంత నీరు కావాలో, ఎంతెంత ఎరువు వేయాలో మొదలైన విషయాలను గురించి వ్యవసాయదారులకు సకాలంలో తెలియ జెప్పడానికి ఉద్దేశింపబడింది. ఇందుకు రాజ్యంలోని వివిధ కేంద్రాలలో వ్యవసాయ పరిశోధనలు జరపడానికి తలపెట్టబడింది. అక్కడ ఆ ప్రాంతంలోని ముఖ్యమైన పంటను పండించడం, రసాయనిక ఎరువులు వేయడం జరుగుతుంది. బాపట్ల అసిస్టెంటు అగ్రికల్చరల్ కెమిస్ట్ పర్యవేక్షణ క్రింద ఈ పరిశోధనలు జరపబడతాయి. ఈ సంవత్సరంలో ఈ పథకం 6 జిల్లాలలో కొనసాగించబడుతుంది. ఇందులో రు. 0.96 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.186 లక్ష మొత్తం ఈ జిల్లాలోని నూజివీడు కేంద్రంలో ప్రయోగాలు జరపడానికిగాను కేటాయించబడింది.

## క్రయవిక్రయ సమాచారం

ఉత్పత్తిదారులు, వర్తకుల సౌకర్యార్థం, ప్రస్తుతం లభ్యమౌతున్న క్రయవిక్రయ సమాచారాన్ని అభివృద్ధిపరచే ఉద్దేశంతో ఈ పథకం ప్రారంభించబడింది. వ్యవసాయ ఉత్పత్తుల, పశుగణ పదార్థాల ధరవరలు, సరకు ఎగుమతి దిగుమతుల విషయంలో వాస్తవమైన వివరాలను సేకరించి తెలియజెప్పడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957-58 లోను, 1958-59 లోను విజయవాడ, వరంగల్లు కేంద్రాలలో ఇద్దరు మార్కెటింగు అసిస్టెంట్లు, ఇద్దరు లోయరు డివిజను గుమాస్తాలు, ఇద్దరు జవాన్లు నియమించ బడినారు. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ రెండు కేంద్రాలలోను నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి రు. 0.34 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో నలగర్ కమిటీ సిఫార్సులను అమలుపరచటానికి నామమాత్రపు కేటాయింపు

రాజ్యాలలో నమూనా వ్యవసాయ సంస్థలను స్థాపించే విషయం గురించి వ్యవసాయ శాఖకు చెందిన అన్ని వర్గాల సిబ్బంది కూడ తమకు అప్పగించబడిన కార్యక్రమాన్ని బాధ్యతతో నిర్వహించేటందుకు వీలుగా అధికారాలను కలిగియుండటం కోసం అన్ని స్థాయీలలోని వ్యవసాయాధి కారులకు అధికారాలను అప్పగించే విషయమై రాజ్య ప్రభుత్వాల పరిశీల నార్థం సిఫారసులను చేయటానికిగాను భారత ప్రభుత్వంవారు 1957–58లో అగ్రికల్చరల్ అడ్మినిస్ట్రేటివ్ కమిటీ అనే ఒక కమిటీని ఏర్పాటు చేశారు. కమిటీ నివేదిక ఇటీవలె అందింది దానినిపరిశీలించి శిఫార్సులను అమలుపరచ డానికిగాను వివరమైన ప్రతిపాదనలకు తుది రూపమీయబడే వరకు 1959–60 ప్రణాళికలో రు. 1.00 లక్ష మొత్తం నామమాత్రంగా కేటాయించబడింది.

## ఉప్పునేలలలో వరిసాగు

సెలెక్షను, హైబ్రిడైజేషను పద్ధతులను ప్రవేశపెట్టి ఉప్పునేలలకు తగి ఉండే వరి రకాలను ఉత్పత్తి చేయడమే ఈ పథకం ఉద్దేశం. రు. 0.18 లక్ష మొత్తం కేటాయింపుతో రెండవ ప్రణాళికలో ఈ పథకం క్రొత్తగా చేర్చ బడింది. అది మచిలీపట్నంలోని వరి, పరిశోధన కేంద్రంలో ఈ సంవత్సరం ప్రారంభించబడుతుంది. అందుకోసం రు. 0.09 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## వ్యవసాయోత్పత్తి సూచీలను తయారు చేయటం

రాజ్యంలోని వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ సూచీ లను సంకలనం చేయటానికి యీ పథకం ప్రతిపాదించబడింది. వ్యవసాయో త్పత్తికి, పొలాలలో పంటల ధరలకు, వ్యవసాయకూలీకి సంబంధించిన వివ రాలు యిందులో ఉంటాయి. ఈ పథకం 1957–58 లో అమలు పరచబడి 1958-59 లో కొనసాగింపబడింది. అది ఈ సంవత్సరం కూడ కొనసాగడం కోసం రు. 0.06 లక్ష మొత్తం కేటాయించబడింది.

### పట్వారీల పనిమీద సరియైన పర్యవేక్షణ

భూమి విస్తీర్ణపు వివరాలు, పంట వివరాలు మొదలైన వాటిని మొదట పట్వారీలు, కరణాలు తయారు చేస్తారు. ముఖ్యమైన పంటల విషయంలో సరియైన వివరాలు జిల్లా స్థాయిలో సేకరించి సరిచేయడమే యీ పథకం యొక్క ప్రధానోద్దేశం. రాజ్యంలో ఎన్ని ఎకరాల మేర ఏ యే పంట పండుతున్నదన్న విషయం గురించి సరియైన అంచనాలను తయారు చేసుకోవడానికి యీ వివరాలు అవసరం. భూమి విస్తీర్ణపు వివరాల విషయంలో సర్దుబాటులు చేయడంలో పట్వారీలు కరణాలు మొదలైన వారి పనిమీద తగు పర్యవేక్షణను జరిపించడం ఈ పథకం ఉద్దేశం. అవసరమయ్యే సిబ్బందిని నియమించడం ద్వారా రాజ్యంలోని జిల్లాలన్నిటిలోను ఈ సంవత్సరం ఈ పథకాన్ని అమలు పరచడానికి ఉద్దేశింపబడింది. అందుకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.35 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ రంగంలో జరిగే పనిని రెవిన్యూ ఇన్స్పెక్టర్లు చూస్తుంటారు. దానిని తాసిల్దార్లు, ఈ పథకం క్రింద నియమించబడిన ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్లు పర్యవేక్షిస్తుంటారు. ప్రణాళిక పర్యవేక్షణ, వివరాల వర్గీకరణ, విభజన విషయాలమీద అర్థ, గణాంకశాఖ అజ్మాయిషీ వహిస్తున్నది.

## చిన్న తరహా నీటిపారుదల పనులు

### వరదగట్ల నిర్మాణం

ఈ సంవత్సరంలో రు. 0.20 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో ఒక వరదగట్టు వేయబడుతుంది.

| | | కేటాయింపు (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | హంసలదీవి నుండి పటిమొగ వరకు | 0.20 |

### మోగల్లు తలుపులబందం

తగు స్థాయి చేకూరేటట్లు తలుపుల బందం కాలవను తిరిగి త్రవ్వడానికి, 490 కలుపుకొని 2/0 నుండి 2/4 వరకు ప్రస్తుతం ఉన్న కాలవను పొడిగించడానికి ఉద్దేశించబడింది. ఇందువల్ల కృష్ణా జిల్లా, నందిగామ

తాలూకాలో 191 ఎకరాల ఆయకట్టు క్రొత్తగా ఏర్పడుతుంది. ఇందుకోసం 1959–60 ప్రణాళికలో రు. 0.03 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కృష్ణా బ్యారేజీ పథకం, పటమట పంపింగు పథకం

కృష్ణా బ్యారేజి పథకం క్రింద రు. 147.40 లక్షల వ్యయంతో 134 చిన్నతరహా నీటిపారుదల పనులు నిర్వహించడానికి తలపెట్టబడింది. ఇందులో 120 పనుల విషయంలో పరిశీలనలు జరపబడ్డాయి. కొన్ని పథకాల పనికూడ ప్రారంభమైంది. కృష్ణా బ్యారేజీ పథకం క్రింది చిన్న తరహా నీటిపారుదల పనులకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 13.14 లక్షల మొత్తం కేటాయించబడింది. కృష్ణా డెల్టాలో మరికొన్ని ఎకరాల భూమికి నీటిపారుదలను కలుగచేయడంకోసం ఈ మొత్తం ఉద్దేశించబడింది.

## చెరువుల అభివృద్ధి పథకం

రెండవ ప్రణాళికా కాలంలో, 9,469 ఎకరాల క్రొత్త ఆయకట్టుకు, 29,545 ఎకరాల ప్రస్తుత ఆయకట్టుకు లాభం కలగడానికి గాను ఆంధ్రి జిల్లాలలో క్రొత్తగా చిన్నతరహా నీటిపారుదల పనులను ప్రారంభించడానికి, కొన్ని చెరువులను పునరుద్ధరించడానికి ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద ఈ సంవత్సరానికి రు. 13.12 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకం క్రింద చేకూరే లాభాలు ఈ జిల్లాకు కూడా లభ్యమౌతాయి.

## ఫిల్టర్ పాయింటు బావులు

ఈ పథకం క్రింద వ్యవసాయదారుల భూములలో ఫిల్టర్ పాయింటు గొట్టపుబావులు త్రవ్వబడతాయి. ఇందుకవసరమయ్యే ఫిల్టర్ పాయింట్లు, ఇతర పరికరాలు సరఫరా చేయబడతాయి. ట్యూబులకు సరఫరా చేయబడిన పరికరాలకు అయ్యే ఖర్చు అంతా పూర్తిగా వసూలు చేయబడుతుంది. అవసరమయ్యే పంపింగు యంత్రాలను కొనడానికి వీలుగా ప్రతి వ్యక్తికి రు.2,500 గరిష్ఠ మొత్తం వరకు ఋణాలు మంజూరు చేయబడతాయి. ఋణాలు,

ప్రభుత్వం వారు అప్పుడప్పుడు నిర్ణయించే వడ్డీతో 5 సమాన వాయిదాలలో రైతుల నుండి వసూలు చేయబడతాయి. 1959-60 లో 140 ఫిల్టర్ పాయింట్ల త్రవ్వకానికిగాను ఋణాల నివ్వడానికి రు. 3.50 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.70 లక్ష మొత్తం 28 ఫిల్టరు పాయింట్లను త్రవ్వడానికై ఋణాలను మంజూరు చేసే నిమిత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## అద్దెకొనుగోలు పద్ధతిమీద ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్ల పంపిణీ

నీటి పారుదల కోసం నీటిని తోడుకోవడానికిగాను ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లు కొనుక్కోవడానికి శక్తిలేని రైతులకు సరఫరా చేయబడతాయి. ఆయిలు ఇంజన్లకు రు. 4 000/-లు, ఎలక్ట్రిక్ మోటర్లకు, రు. 2000/- గరిష్ట మొత్తం ఋణాలు ఇవ్వబడతాయి. ఈ మొత్తం 4 శాతం వడ్డీ, 3 శాతం సెంటేజీ చార్జీతో సహా 5 నుండి 7 వాయిదాలలో వసూలు చేయబడుతుంది. ఈ సంవత్సరంలో 122 ఆయిలు ఇంజన్లు, 155 ఎలక్ట్రిక్ మోటరు పంపుసెట్ల సరఫరా నిమిత్తం ప్రణాళికలో రు. 8 లక్షల మొత్తం కేటాయించబడింది. పై కేటాయింపులో రు. 0.78 లక్ష మొత్తం 11 ఆయిలు ఇంజన్లు, 17 ఎలక్ట్రిక్ మోటర్ల కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గొట్టపు బావుల పథకం

భారత ప్రభుత్వం వారి సహాయంతో టి. సి. ఎం కార్యక్రమం క్రింద ఆంధ్రప్రాంతంలో 25 ప్రయోగాత్మక గొట్టపు బావులను త్రవ్వటానికి ఈ పథకం క్రింద తలపెట్టబడింది 1958-59 లో 15 ప్రయోగాత్మక గొట్టపు బావులు త్రవ్వబడ్డాయి, ఈ సంవత్సరంలో రు. 10.27 లక్షల మొత్తం, పథకాన్ని కొనసాగించడానికి కేటాయించబడింది. పవర్ డ్రిల్లు పథకాన్ని అమలు పరచడానికి ఈ పథకం క్రింద పవర్ డ్రిల్లును కొనడం, అసిస్టెంటు ఇంజనీర్లను నియమించడం జరుగుతుంది. సహాయక సిబ్బంది నియామకానికి ఉపకరణాల తయారీ, మరమ్మత్తుల వర్కుషాపులను నెలకొల్పడానికి ఈ పథకంలో ఏర్పాటు ఉన్నది. దీనివల్ల కలిగే ప్రయోజనాలు ఈ జిల్లాకు కూడా లభ్యమౌతాయి.

### క్రొత్త బావులకు సబ్సిడీ పథకం

వ్యవసాయోత్పత్తిని అధికం చేసేటందుకు నీటిపారుదల బావులను త్రవ్వుకొనేటందుకు రైతులకు సబ్సిడీ రూపంలో ఈ పథకం క్రింద బావి ఒక్కంటికి రు. 750 లు చొప్పున ఇవ్వబడుతుంది. 1959—60లో ఆంధ్ర ప్రాంతంలో 1750 బావుల త్రవ్వకానికిగాను సబ్సిడీల క్రింద రు. 13.125 లక్షల మొత్తం కేటాయించబడింది పై కేటాయింపులో. రు. 0.5624 లక్షల మొత్తం 75 బావుల త్రవ్వకానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## భూమి అభివృద్ధి

### ట్రాక్టర్లు, బుల్ డోజర్లతో భూమి బాగుచేయడానికి పథకం

బుల్ డోజర్ల గిరాకీ ఎక్కువగా ఉండడం వల్ల, రైతులకు అద్దెకు ఇవ్వడానికి గాను రెండవ ప్రణాళికలో బుల్ డోజర్లను కొనడానికి తలపెట్ట బడింది. విదేశీమారకం కష్టంగా ఉండడంవల్ల ఇంతవరకు బుల్ డోజర్లను కొనడానికి వీలులేకపోయింది. అయితే ఈ సంవత్సరం 5 బుల్ డోజర్లను కొనడానికి తలపెట్టబడింది. అందుకోసం ప్రణాళికలో రు. 5 30 లక్షల మొత్తం కేటాయించబడింది. అవి ఈ జిల్లాలోని రైతులకు కూడా అద్దెకు లభ్యమౌతాయి.

## పశు సంవర్ధన

### కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధి కోసం ఎంపిక చేయబడ్డ ప్రాంతాలలో కట్టుదిట్ట మైన కృషి జరిపేటందుకు ఈ పథకం క్రింద ఉద్దేశింపబడింది. ఆబోతులకు విత్తు కొట్టడం, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల అజ్మాయిషీ క్రింద దూడల పెంపకం, సబ్సిడీ మీద దూడలను పోషించడం, సహకార పద్ధతులమీద పశు గ్రాసపు పంటలను అభివృద్ధి పరచడం ఈ పథకంలో చేరిఉంటాయి. 1957—59 లో ఆంధ్ర దేశంలో 10 కీలక గ్రామ కేంద్రాలు స్థాపించబడ్డాయి. మరో 9 కేంద్రాలను స్థాపించడానికి, ఇదివరకే ప్రారంభించబడిన కేంద్రాలను కొన సాగించడానికి తలపెట్టబడింది. అందుకోసం 1959—60 ప్రణాళికలో

రు. 11.107 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో రు. 1.291 లక్షలు ఒక క్రొత్త కీలకగ్రామ కేంద్రాన్ని, ఒక పట్టణ కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాన్ని స్థాపించడానికి, ఒక పాత కీలకగ్రామ కేంద్రాన్ని కొనసాగించ డానికి ఈ జిల్లాకు కేటాయించబడ్డాయి.

## గోశాల అభివృద్ధి

ద్రవ్యసహాయం చేసి గోశాలలను అభివృద్ధి పరచటం ఈ పథకం ఉద్దేశం. 1959–60 లో 4 క్రొత్త గోశాలలకు, 5 పాతవాటికి ద్రవ్య సహాయం చేయడానికి తలపెట్టబడింది. అందుకు రు. 0.81 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 0.052 లక్ష 2 గోశాలలకు ద్రవ్య సహాయం కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## పశు ప్రదర్శనాలు

పశువులను పెంచే వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించేటందుకు శాస్త్రీయ పద్ధతులలో దూడలను పెంచడంలోను, పోషణలోను ప్రజలకు తెలియ జెప్పడానికి రాజ్య ప్రదర్శనాలను, జిల్లా ప్రదర్శనాలను ఏర్పాటు చేయ డానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959–60 లో 5 ప్రదర్శనాలను జరప డానికి ఈ జిల్లాకు రు. 0.026 లక్ష మొత్తం కేటాయించబడింది.

## కోళ్ళ పెంపకపు విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పైలెట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్రప్రాంతంలో 1957–59 లలో 12 కోళ్ళ పెంపకపు విస్తరణ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. ఇదివరకే ప్రారంభింపబడిన కేంద్రాలను కొనసాగించడమే కాకుండా 1959–60 లో మరి 4 విస్తరణ కేంద్రాలను ప్రారంభించడానికి కూడా తలపెట్టబడింది. అందుకు ప్రణా ళికలో రు. 2.76 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 1.123 లక్షల మొత్తం ఒక కోళ్ళ విస్తరణ కేంద్రాన్ని, ఒక బాతుల విస్తరణ కేంద్రాన్ని ప్రారంభించడానికి, ఒక కోళ్ళ విస్తరణ కేంద్రాన్ని కొనసాగించ డానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## పందుల పెంపకం

ఈ పథకం క్రింద, ఆంధ్రప్రాంతంలో మూడు పందుల పెంపకపు అభివృద్ధి బ్లాకులతో ఒక ప్రాంతీయ పందుల పెంపకపు యూనిట్టు జాతి పందుల పెంపకం కోసం స్థాపించబడింది. ఈ యూనిట్టు లాభదాయకమైన పందుల పెంపకం గురించి రైతులకు తెలియజెప్పడానికి ఒక నమూనా కేంద్రంగా పనిచేస్తుంది. 1959–60 లో ఆంధ్రలోమరి 6 పందుల పెంపకం అభివృద్ధి బ్లాకులను స్థాపించడానికి తలపెట్టబడింది. అందులో రెండు బ్లాకులు, ఈ జిల్లాలో స్థాపించబడతాయి. అందుకోసం రు. 1.02 లక్ష మొత్తం కేటాయించబడింది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానికంగా ఉండే పశుగణాన్ని అభివృద్ధి పరచే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక కాలంలో రైతులకు తగ్గింపు రేట్లకు అంటే అసలు ఖరీదులో సగానికి ఆబోతులను, దున్నపోతులను మేకలను, మేకపోతులను, పందులను, పోతుపందులను, పొట్టేళ్ళను, విదేశీకోడిపుంజుల్ని, పెట్టల్ని గ్రుడ్లను పంపిణీ చేయడానికి ఉద్దేశింపబడింది. 1959–60 లో ఈ జిల్లాలో పంచదలచుకున్న పశువుల సంఖ్య, వాటి క్రింద కేటాయించిన మొత్తాలు ఈ దిగువ తెలుపబడ్డాయి.

| | | సంఖ్య | కేటాయించిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|---|
| 1. | ఆబోతుల సరఫరా | 9 | 0.0945 |
| 2. | దున్నపోతులు | 10 | 0.105 |
| 3. | మేకపోతులు | 8 | 0.009 |
| 4. | ఆడమేకలు | 9 | 0.008 |
| 5. | పోతుపందులు | 5 | 0.0133 |
| 6. | ఆడపందులు | 3 | 0.008 |

| | | | |
|---|---|---|---|
| 7. | పొట్టేళ్ళు | 6 | 0.005 |
| 8. | విదేశీకోడిపుంజులు | 170 | 0.02 |
| 9. | విదేశీకోడిపెట్టలు | 170 | 0.02 |
| 10. | విదేశీజాతిగ్రుడ్లు | 400 | 0.004 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్లు

గొర్రెల, ఉన్ని ప్రదర్శన యూనిట్లు ప్రస్తుతం మూడు పని చేస్తున్నాయి. అవి అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో ఉన్నాయి. ఈ యూనిట్లు గొర్రెల పెంపకంమీద ప్రచారం చేసి, ప్రదర్శనలు ఏర్పాటు చేస్తాయి. ప్రతి యూనిటుకు ఒక వెటర్నరీ అసిస్టెంటు సర్జను, ఇద్దరు మంద గొల్లలు ఉంటారు. 1959–60 లో ప్రస్తుతం ఉన్న మూడు యూనిట్లకు అదనంగా సిబ్బందిని నియమించడానికి, నంద్యాల, విజయవాడ, విశాఖ పట్టణం. ఆదోనిలలో క్రొత్తగా 4 యూనిట్లను ప్రారంభించడానికి ఉద్దేశింపబడింది. ఇంతేకాకుండా గొర్రెల, మేకల అభివృద్ధి అధికారి కార్యాలయంలో అదనంగా గుమాస్తాలను నియమించి అభివృద్ధిపరచడం కూడా జరుగుతుంది. 1959–60 లో కేటాయించబడిన రు. 0.94 లక్ష మొత్తంలోను రు. 0.187 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను ప్రధాన కార్యాలయంలోను అదనపు సిబ్బంది నియామకం

పని ఎక్కువ కావడం వల్ల అవసరమైన అదనపు సిబ్బందిని ప్రధాన కార్యాలయంలోను, చింతలదీవి ప్రభుత్వ పశుగణ క్షేత్రంతో సహా జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను నియమించటానికి తలపెట్టబడింది. అందుకు 1959–60 ప్రణాళికలో రు. 0 72 లక్ష మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తంలో ఈ జిల్లాకు రు. 0.067 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గాళ్ళ వ్యాధి నిర్మూలన పథకం

దేశంలో గాళ్ళ వ్యాధిని నిర్మూలించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం వారు వ్యాధిరాకుండా పశువులన్నిటికి టీకాలు వేయడానికి ఒక పథకాన్ని

ప్రారంభించారు. ఈ టీకాల ఉద్యమం ద్వారా టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకోసం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలో టీకాలు వేయడానికిగాను మరొక పథకం కూడ మంజూరు చేయబడింది. ఆచరణలో ఎదురయ్యే చిక్కులు మందు దొరకక పోవడంవంటి వాటి కారణంగా ఈ పని పూర్తి చేయడానికి వీలు లేకపోయింది. అందువల్ల ఈ తదుపరి ఉద్యమాన్ని పై జిల్లాలో కొనసాగించ డానికి, మామూలు టీకాల ఉద్యమం ఈ సంవత్సరం పూర్తి కాగలదని ఆశింపబడుతున్న కృష్ణానదికి ఉత్తర భాగపు జిల్లాలలో కూడా రెండవ పథకాన్ని ప్రారంభించడానికి తలపెట్టబడింది ఈ పథకాన్ని అమలు పరచేటందుకు 1959–60 ప్రణాళికలో రు. 1.95 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.243 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది.

## క్లినికల్ లేబరేటరీలు

రసాయనిక పరీక్షలను జరిపి సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయడం కోసం రాజ్యంలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులు, పశుగణ క్షేత్రాలు ప్రతిదానిలోను క్లినికలు లేబరేటరీలను స్థాపించడానికి ఉద్దేశింప బడింది. 1957–58 లో విశాఖపట్నం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు హెడ్ క్వార్టర్సు వెటర్నరీ ఆసుపత్రులలో ఐదు క్లినికలు లేబరేట రీలు ప్రారంభించబడ్డాయి. 1959–60 లో పశ్చిమగోదావరి కృష్ణా, అనంత పురం జిల్లాలలో మరి 3 క్లినికల్ లేబరేటరీలను ప్రారంభించడానికి, ఇదివరకే ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి తలపెట్ట బడింది. అందుకు రు. 0.89 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 0.24 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## సంచార పశువైద్యదళాలు, ప్రథమ చికిత్సా కేంద్రాలు
## చిన్నతరహా పశువైద్యశాలలు
## పశువైద్యశాలలు

గ్రామీణ ప్రాంతాలలోను, పట్టణ ప్రాంతాలలోను పశువులకు ఉత్తమంగా వైద్య సహాయాన్ని కలుగజేయడానికి, అంటువ్యాధులను కట్టు దిట్టంగా నివారించడానికి గాను ఈ పథకాలు ఉద్దేశింపబడ్డాయి. 1959–60

సంవత్సరంలో ఇది వరకే ప్రారంభించబడిన పాత వైద్యశాలలను, సంచార వైద్యశాలలను ప్రథమ చికిత్సా కేంద్రాలను కొనసాగించడమే కాకుండా ఈ జిల్లాలో రు. 1.058 లక్ష వ్యయంతో 11 ప్రథమ చికిత్సా కేంద్రాలను, 3 చిన్న పశు వైద్యశాలలను, రెండు పశు వైద్యశాలలను ప్రారంభించడానికి తలపెట్టబడింది.

## *పెద్దతరహా పశువైద్యశాలల్లో లోయర్ డివిజను గుమాస్తాల నియామకం*

1958–59 లో నియమించబడిన 9 లోయర్ డివిజను గుమాస్తాల ఉద్యోగాలను కొనసాగించడానికి 1959–60 ప్రణాళికలో రు. 0.08 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.02 లక్ష ఇద్దరు లోయరు డివిజను గుమాస్తాలను కొనసాగించడానికి ఈ జిల్లాకు కేటాయించబడ్డాయి.

## *జిల్లా వెటర్నరీ ఉద్యోగులకు జీపుల సరఫరా*

పనిని తనిఖీ చేయడానికి, సిబ్బందిని సిద్ధంగా ఉంచేటందుకు తరచుగాను, హటాత్తుగాను జిల్లా వెటర్నరీ ఉద్యోగులు వెళ్ళి చూడ్డానికి వీలుగా ఉండేటందుకు వారికి జీపులుండడం అవసరం. అందుచేత 1959–60 ప్రణాళికలో రు. 0.54 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.029 లక్ష మొత్తం ఇదివరకే సరఫరా చేయబడిన జీపు నిర్వహణకు గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## *వెటర్నరీ కాంపౌండర్లకు శిక్షణ*

వెటర్నరీ కాంపౌండర్ల కొరతను తీర్చడానికి, ఒక్కొక్క కేంద్రంలోను 60 మంది చొప్పున ఆరు కేంద్రాలలోను రెండు బ్యాచీలుగా 1959–60 లో 360 మంది శిక్షణ ఇవ్వడానికి తలపెట్టబడింది. ఈ పథకానికి 1959–60 లో కేటాయించబడిన రు. 0.50 లక్ష మొత్తంలోను రు. 0.09 లక్ష మొత్తం 60 మందికి శిక్షణ ఇచ్చేటందుకు ఈ జిల్లాకు కేటాయించబడింది.

## విజయవాడ పాల సరఫరా పథకం

కృష్ణా జిల్లాలోను, చుట్టుప్రక్కల ప్రాంతాలలోను పాలు సమృద్ధిగా దొరుకుతాయి. అందువల్ల పాలను సేకరించి, ప్రాసెస్సు చేసిన తర్వాత సరసమైన ధరలకు వినియోగదారులకు పంపిణీ చేసే ఉద్దేశంతో వ్యాపార సరళిలో పాల సరఫరా పథకాన్ని ప్రారంభించడం మంచిదని భావించబడింది. ఐక్యరాజ్య శిశు సంక్షేమ నిధి అధికారులు కూడా ఈ ప్రాంతాన్ని ఆమోదించారు. పాడిపరిశ్రమ భవనాల నిర్మాణం కోసం స్థల నిర్ణయం జరిగింది. విలువైన పరికరాలను ఐక్యరాజ్య శిశు సంక్షేమ నిధి అధికారులు సరఫరా చేయవచ్చును.

1959—60 లో ఈ పథకానికి రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

# పాడి పరిశ్రమ, పాల సరఫరా

## ఆంధ్ర

## పాలపొడి ఫ్యాక్టరీ

పాలు ఎక్కువగా లభ్యమయ్యే ప్రాంతాలలో పాలపొడి ఫ్యాక్టరీని స్థాపించడానికి రెండవ ప్రణాళికలో ఉద్దేశించబడింది. భారత ప్రభుత్వంవారి కోరికమీద, ఫ్యాక్టరీ స్థల నిర్ణయం జరిగేటందుకు పాలు ఎంత ఎక్కువగా లభ్యమౌతాయో నిర్ణయించడానికి గాను కృష్ణా, గుంటూరు కోస్తా జిల్లాల్లోను, పశ్చిమ గోదావరి జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లోను పరిశీలన కూడా జరపబడింది. ఈ పరిశీలన ఫలితంగా పాలపొడి ఫ్యాక్టరీని స్థాపించడానికి తగినంత అధికంగా పాలు లభ్యమౌతాయనే విషయం ఋజువైంది. ఈ సందర్భంలో ప్రదేశాన్ని తనిఖీచేయడానికీ, పథకాన్ని విజయవంతంగా అమలుపరచడానికిగల అవకాశాలను అన్వేషించడానికి గాను భారత ప్రభుత్వ పాడి పరిశ్రమాభివృద్ధి సలహాదారు విజయవాడ సందర్శించారు. ఈ జిల్లాలో పాలపొడి ఫ్యాక్టరీని ప్రారంభించడానికి గాను 1959—60 లో రు. 2.00 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది.

# అడవులు

## అడవుల పునరుద్ధరణ

అటవీశాఖ స్వాధీనపరచుకొన్న ఎస్టేటు, పంచాయతీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధిపరచే ఉద్దేశంతో ఆ ప్రాంతాలలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పరచబడ్డాయి. ఈ జిల్లాలో ఇంతకుముందు ఏర్పరచిన వాటిని నిర్వహించడమే కాకుండా 200 ఎకరాలలో క్రొత్తగా పునరుద్ధరణ క్షేత్రాలను ఏర్పరచడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.06 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది.

## కలప రవాణా నియమావళి

కలపను దొంగరవాణా చేయకుండా నివారించడానికిగాను కలపను ఒక చోటునుండి మరొక చోటకు చేర వేయడం మీద కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరపడానికి ఈ పథకం ఉద్దేశింపబడింది. 1959–60 లో ఆంధ్ర ప్రాంతపు డివిజన్లు అన్నింటిలోను 80 మంది ఠానాదార్లు నియమింపబడతారు. ఇందుకు ప్రణాళికలో రు. 0.35 లక్ష మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తంలో రు. 0.0044 లక్ష మొత్తం ఒక ఠానాదారు నియామకానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

# మత్స్య సంవర్ధన

## అధికంగా చేప పిల్లలను సేకరించడం, పంపిణీ చేయడం

చేప పిల్లలను, అందులోను త్వరితంగా పెరిగే వాటిని, అవి సమృద్ధిగా దొరికే గోదావరి, కృష్ణానదులనుండి, తూర్పుగోదావరి, పశ్చిగోదావరి, కృష్ణా గుంటూరు డెల్టా జిల్లాలలోని నీటిపారుదల కాలవలనుండి సేకరించి మత్స్య ఉత్పత్తిని అధికం చేయడానికిగాను రాజ్యంలోని జలాశయాల్లో నిల్వ చేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957–58 లో కొంత అదనపు సిబ్బందిని నియమించడమే కాకుండా, సేకరణ కేంద్రాలనుండి నిల్వజేసే ప్రాంతాలకు చేపలను చేరవేసేటందుకు 12 వ్యాన్లు కొనబడ్డాయి. ప్రస్తుతం ఉన్న సిబ్బందితోను, వ్యానులతోను 1959–60 లో రెండుకోట్ల చేప పిలల్ని సేకరించడానికి తలపెట్టబడింది. అందుకోసం, ప్రణాళికలో రు. 1.93 లక్షల

మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.25 లక్ష మొత్తం, 40 లక్షల చేప పిల్లల్ని సేకరించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలోని చేపల మార్కెట్లలో ఎక్కువ భాగం పారిశుధ్యమనేదే లేని పరిస్థితులలో అసహ్యాకరంగా ఉండే ప్రదేశాలలో ఉన్నాయి. పరిశుభ్రంగా చేపల మార్కెట్లను నిర్మించడం, నిర్వహించడం మామూలుగా లోకల్ బోర్డుల, మున్సిపాలిటిల బాధ్యతే అయినప్పటికీ వాటి అదాయ మార్గాలు తక్కువగా ఉండడం వల్ల వాటికి సబ్సిడీలను ఇచ్చి స్థానిక సంస్థలకు వాటి నిర్మాణం విషయంలో సహాయపడడానికి తలపెట్టబడింది. 1959–60 లో ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్ద చేపల మార్కెట్లను, 5 చిన్న వాటిని నిర్మించడానికి లోకల్ బోర్డులకు, మునిసిపాలిటీలకు సబ్సిడీ ఇవ్వడానికిగాను రు. 1.23 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో ఈ జిల్లాలో ఒక మార్కెటుకు ప్రభుత్వం ద్రవ్య సహాయం చేస్తుంది.

## ఉప్పు సబ్సిడీ పథకం

అమ్మగా మిగిలిన చేపలను బెస్తవారు ఆరోగ్యకరమైన విధానాలలో ఎండబెట్టుకునేటందుకు తగ్గింపు రేట్లపై ఈ పథకం క్రింద ఉప్పు సరఫరా చేయబడుతుంది. ఇందువల్ల వారు పడిన శ్రమకు తగిన ఫలం పొందడానికి వీలుచేకూరుతుంది. ప్రస్తుతం ఆంధ్రప్రాంతంలోని కోస్తా జిల్లాలలో ఇటువంటివి 14 కేంద్రాలున్నాయి. 1959–60 లో వాటిని రు. 0.53 లక్ష మొత్తం వ్యయంతో కొనసాగించడానికి తలపెట్టబడింది. అందులో రు. 0.05 లక్ష మొత్తం, 200 టన్నుల చేపలను ఎండపెట్టడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## మరనావల సరఫరా

బెస్తవారు తీరానికి దూరంగా అతిత్వరితంగా పోయి ఎక్కువగా చేపలు పట్టుకోవడానికి వీలుగా ఉండేటందుకు తగ్గింపు రేట్లకు అంటే అసలు ఖరీదులో 66% కు 1959–60 లో రు. 4.33 లక్షల వ్యయంతో బెస్తవారికి వారి సహకార సంఘాలకు 21 ఇంజన్లు అమర్చబడిన నావలు ఈ పథకం

క్రింద పంచిపెట్టడానికి ఉద్దేశింపబడింది. ఈ 21 నావలలో 4 నావలు ఈ జిల్లాలో పంచిపెట్టబడతాయి.

## క్రొత్తరకం నైలాను వలలు

ప్రస్తుతం బెస్తలు ప్రత్తితోను, జనుముతోను చేసిన వలలను వాడుతున్నారు. ఇవి అంత మన్నికైనవి కావు. తరచుచేపలు వలలు తెంపుకుని పోవడం కూడా జరుగుతున్నది. తత్ఫలితంగా బెస్తలు వారు పడ్డ శ్రమకు తగిన ఫలితం పొందడంలేదు. నైలాను వలలు బాగా పని చేస్తున్నట్లు కనుగొనబడింది. అందువల్ల 200 నైలాను వలలను అసలు ఖరీదులో 33⅓% కు 1959–60 లో బెస్తలకు పంపకం చేయడానికి ఉద్దేశింపబడింది. వీటి ఖరీదు చేపలు పట్టని కాలం వదలి 5 సంవత్సరాల కాలపరిమితితో తేలిక వాయిదాలలో వారినుండి వసూలు చేయబడుతుంది. ఆ 200 వలలలో 20 వలలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి

## బెస్తవారికి దుంగల సరఫరా

పేదరికంవల్ల, దుంగల ఖరీదు అధికం కావడంవల్ల, బెస్తలు వారు మొదట్నించి వాడుతున్న దుంగలు పాతవై పోయినప్పటికి క్రొత్తవాటిని కొనుక్కోలేక పోతున్నారు. అందువల్ల అసలు ఖరీదులో 75 శాతానికి 1959–60 లో 320 దుంగలను ఈ పథకం క్రింద పంపిణీ చేయడానికి ఉద్దేశించబడింది. ఈ ఖరీదు 5 సంవత్సరాల కాలపరిమితితో తేలిక వాయిదాల మీద వసూలు చేయబడుతుంది. అందులో 40 దుంగలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## త్వరిత రవాణా సౌకర్యాలు

చేపల నిలవ ఉండడం వల్ల చెడిపోకుండా కాపాడేటందుకు 10 వ్యానులు, 2 కారియర్ బోటులు 1957–59 లలో కొనబడ్డాయి. ప్రస్తుతం రవాణా సౌకర్యాలు లేని రోడ్లమీద ఈ వ్యానులు నడపబడతాయి. ప్రతి ఏడు వీటికయ్యే ఖర్చుకోసం 1959–60 లో రు. 1.00 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. ఆ 14 వ్యానుల్లోను ఒకటి ఈ జిల్లాకు లభ్యమౌతుంది.

### లోతు ఎక్కువగా ఉండే జలాశయాల్లో చేపలను పట్టడానికి సంబంధించిన ప్రయోగాలు

లోతు ఎక్కువగా ఉండే జలాశయాల్లో చేపలు పట్టడానికి తగినసాధనాలు లేకపోవడంవల్ల, ఏ విధంగా పట్టాలో బెస్తవారికి తెలియక పోవడంవల్ల ఆంధ్రప్రాంతంలో లోతు ఎక్కువగా ఉండే చెరువుల్లో చేపలను పట్టడం లేదు. అందువల్ల నైలాను రంగూను వలలతో ప్రయోగాలను జరిపేటందుకు లోతు, ఎక్కువగా ఉండే జలాశయాల్లో చేపలకు పట్టేవిధానాన్ని గురించి బెస్త వారికి తెలియజేప్పేటందుకు ఉద్దేశింపబడింది. అందుకోసం లోతు ఎక్కువగా ఉండే జలాశయాల్లో చేపలను పట్టే యూనిట్టు ఒకటి 1958–59 లో కృష్ణా జిల్లాలో స్థాపించబడింది. ఈ సంవత్సరంలో ఈ యూనిట్టుకు ఏటాఅయ్యే ఖర్చుకోసం రు. 0.20 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ యూనిట్టు ఇతర జిల్లాలలోని బెస్తవారికికూడా ఉపయోగపడుతుంది.

### పడవల నిర్మాణపు కేంద్రం

చిన్న పడవలను నిర్మించేటందుకు ప్రస్తుతం రాజ్యంలో ఏ విధమైన నిర్మాణ కేంద్రంగాని లేదు. పడవలను ఉపయోగించటం ఎక్కువ చేయడంవల్ల పడవలకు యంత్రాలను సమకూర్చడం వల్ల ఎక్కువ కావలసిన పడవల అవసరాలను తీర్చడానికి, తూర్పుగోదావరి జిల్లాలో రు. 1.00 లక్ష వ్యయంతో 1959-60లో ఒక నిర్మాణ కేంద్రం నెలకొల్పబడింది. ఈ సంవత్సరంలో రు. 1.00 లక్ష మొత్తం ఈ కేంద్రాన్ని నిర్వహించడానికి, 60 పడవలను తయారు చేయడానికి గాను ప్రణాళికలో కేటాయించబడింది. అందులో 5 పడవలు ఈ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

## సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు

### గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ

ఇది కొనసాగుతు వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘం వారి సిఫార్సులకు అనుగుణంగా రాజ్యంలోని గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించడం, పటిష్ఠం చేయడం, విస్తరింప చేయడం ఈ పథకం యొక్క ఉద్దేశాలు. సహకారశాఖలో సిబ్బందిని

పటిష్ఠం చేయడం, సెంట్రల్ బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలు నియమించిన అదనపు పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికయ్యే ఖర్చుకు ద్రవ్య సహాయం చేయడం ద్వారా ఈ పథకం రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో అమలుపరచబడింది.

సహకార సంఘాలను గ్రామీణ ప్రజలనాధారంగా చేసికొని నిర్మించబడాలనే సహకార విధానానికి సంబంధించిన జాతీయాభివృద్ధి మండలి తీర్మానం దృష్ట్యా ఈ సంవత్సరంలో అదనంగా పెద్దతరహా సంఘాలు గ్రామీణ బ్యాంకులు స్థాపించబడవు. కాని ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం వున్న 500 చిన్న సంఘాలను పటిష్ఠం చేయడమే కాకుండా కొత్తగా 350 చిన్న సంఘాలను ఏర్పాటు చేయడానికి కూడ ఉద్దేశింపబడింది. నూటికి 82 గ్రామాలు, నూటికి 28 మంది గ్రామీణ ప్రజలు ఈ పథకం క్రిందికి ఈ సంవత్సరానికి తీసికొనిరాబడతారు. స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలు కూడా ఇవ్వబడతాయి. రు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఆడిటును అడ్మినిస్ట్రేషను నుండి వేరు చేయాలనే పథకాన్ని అమలు పరచచానికి కూడా ఈ సంవత్సరం ఉద్దేశింపబడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారు కూడా హెడ్ క్వార్టర్సులో నియమింపబడతారు. ఆయన గ్రామీణ పరపతి పథకంపై ప్రత్యేకంగా అజ్మాయిషీ వహిస్తారు.

ఈ జిల్లాలో అమలుజరపబడే కార్యక్రమంక్రింద 10 క్రొత్త చిన్నతరహా సంఘాలను నిర్వహించడం, ప్రస్తుతమున్న 55 చిన్నతరహా సంఘాలను పటిష్ఠం చేయడం, పాత సంఘాలలో 17,600 సభ్యులను, క్రొత్త సంఘాలలో 500 మంది సభ్యులను చేర్పించడం, రు. 162 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలను, రు. 10 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలను ఇవ్వడం జరుగుతుంది.

పై కార్యక్రమాన్ని అమలుపరచటానికి రు. 1,18,414/- ల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఈ మొత్తం క్రింది విధంగా వినియోగింపబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| | (ఎ) 1958–59 లో ప్రారంభించబడిన సంఘాలకు | 5,300 |
| | (బి) 1959–60 లో ఏర్పచబడే క్రొత్త సంఘాలకు | 6,500 |
| 2. | (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు. | 17,800 |
| | (బి) గ్రామీణ బ్యాంకుల కోసం సీనియరు ఇన్‌స్పెక్టర్ల కయ్యే ఖర్చు | 1,400 |
| 3. | ఈ క్రింది వాటికిగాను సెంట్రల్ బ్యాంకులకు సబ్సిడీ. | |
| | (ఎ) ఇదివరకు నియమించబడిన పాత సూపరు వైజర్లు. | 8,000 |
| | (బి) 1959–60లో నియమించబడే క్రొత్త సూపరు వైజర్లు. | 2,400 |
| 4. | అదనపు సిబ్బందికి ఖర్చు. | |
| | (ఏ) ప్రణాళికలోని మొదటి రెండు సంవత్సరాలలో నియమించబడ్డ క్రెడిట్ సీనియరు ఇనస్పెక్టరు, జూనియరు ఇనస్పెక్టర్లు. | 7,090 |
| | (బి) విజయవాడలోని క్రొత్త సర్కిలుకు సిబ్బంది. | 26,500 |
| | (సి) కో–ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రార్స్ ఫార్ క్రెడిట్ | 8,400 |
| | (డి) కో–ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారులు (సి.డి.), టైపిస్టులు, జవానులు. | 10,600 |
| | (ఇ) ఆడిటును వేరుచేయడానికి సిబ్బంది | 8,344 |
| | (ఎఫ్) 1959–60 లో డిప్యూటీ రిజిస్ట్రార్ల సర్కిళ్ళలో ప్రతిదానిలోను నియమించబడే ఒక్కొక్క జూనియరు ఇన్‌స్పెక్టరు | 3,680 |
| | (జి) విజయవాడలోని క్రొత్త సర్కిలుకు ఒక సీనియరు ఇన్‌స్పెక్టరు, ఒక జూనియరు ఇన్‌స్పెక్టరు | 2,800 |

| | |
|---|---|
| (హెచ్.) విజయవాడలోని సర్కిలుకు జవానుతో కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారు (క్రెడిట్), సైపిస్టు, జవానుతో కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారు (ప్లానింగు) | 9,600 |
| మొత్తం | 1,18,414 |

## భూమి తనఖాబ్యాంకుల అభివృద్ధి

భూమికి శాశ్వత మరమ్మత్తులు చేయడానికి, నీటిపారుదల సౌకర్యాలకు ఏర్పాటు చేసుకోవడానికి, బాగుచేయడానికి తదితర పనులకు గాను ప్రాథమిక భూమి తనఖాబ్యాంకుల ద్వారా 25 సంవత్సరాలలో తీర్చుకోవగ్గ దీర్ఘకాలిక ఋణాలను ఇవ్వడం ఈ పథకం యొక్క ఉద్దేశం. ఈ సంవత్సరం రు. 16.00 లక్షల వరకు ఈ జిల్లాలో దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వబడతాయి. ఈ సంవత్సరం ఈ జిల్లాకు కేటాయించబడిన రు. 13,100 మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించబడిన అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు | 4,000 |
| 2. | ఈ సంవత్సరంలో నియమించబడే అదనపు సూపరువైజర్లకయ్యే ఖర్చు | 1,100 |
| 3. | భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణకు కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారుకు, జవానులకు అయ్యే ఖర్చు | 8,000 |
| | మొత్తం | 13,100 |

## సహకార పద్ధతులపై క్రయ విక్రయాల అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. సహకార పద్ధతులపై వ్యవసాయోత్పత్తుల క్రయ విక్రయాలను అభివృద్ధి పరచడానికి ఉద్దేశిస్తున్నది.

వ్యవసాయ దారులకు, ప్రత్యేకించి చిన్నరకం, మధ్యరకం ఉత్పత్తిదార్లకు ఈ పథకం క్రింద స్టోరేజి, గిడ్డంగి, ప్రోసెసింగు సౌకర్యాలు, క్రయ విక్రయ సౌకర్యాలు ఏర్పాటు చేయబడతాయి. క్రయ విక్రయ సంఘాల ద్వారా రసాయనిక ఎరువులను అవసరమయ్యే ఇతర పదార్థాలను సరఫరా చేయడమే కాకుండా ఉత్పత్తుల మీద రైతులకు స్వల్పకాలిక ఋణాలుకూడా ఇవ్వబడతాయి. గ్రామ స్థాయిలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలకు, మండీ కేంద్రాలలో పనిచేస్తున్న మార్కెటింగు సంఘాలకు సన్నిహిత సంబంధాల్ని చేకూర్చడానికి కూడా ఈ పథకం క్రింద ఉద్దేశించబడింది.

ఈ పథకం యొక్క పై ఆశయాలను సాధించడానికి రాజ్య ప్రభుత్వపు వాటాతోను శిక్షణ పొందిన సిబ్బందితోను ప్రాథమిక క్రయ విక్రయ సంఘాలను పునర్వ్యవస్థీకరించడానికి, పటిష్ఠం చేయడానికి రెండవ ప్రణాళికలో ఏర్పాటు చేయబడింది. అంతేకాకుండా మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులు, గ్రామస్థాయిలో సహాయక గిడ్డంగులను నిర్మించడానికి, ప్రత్తి జిన్నులు, నూనెమిల్లులు, చెరకుగానుగలు వంటి ప్రోసెసింగు యంత్రాలను స్థాపించడానికి, సంఘాలకు ఆర్థిక సహాయం చేయటానికి కూడ ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం ఈ క్రింద వివరింపబడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉత్పత్తిపై ఋణాలను ఇవ్వడం (రూపాయలు లక్షలలో) | 80.00 |
| 2. | క్రయ విక్రయ సంఘాలు నిర్మించుకొనే గిడ్డంగులు (సంఖ్య) | 3 |
| 3. | పెద్ద తరహా సంఘాలు నిర్మించుకొనే గిడ్డంగులు (సంఖ్య) | 2 |

పై కార్యక్రమాన్ని అమలుపరచడానికి ఈ జిల్లాకు రు. 3.986 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ దిగువ తెలిపిన విధముగా ఆ మొత్తం వినియోగించబడుతుంది.

| | | రు. లక్షలలో |
|---|---|---|
| | 1. ప్రాథమిక క్రయవిక్రయ సంఘాలకు వాటా మూలధన విరాళం | 1.050 |
| | 2. జిల్లా క్రయ విక్రయ సంఘాలకు వాటా మూలధన విరాళం | 0.400 |
| | 3. ప్రాథమిక క్రయవిక్రయ సంఘాలకు మేనేజిరియల్ సిబ్బందికి గాను సబ్సిడీ | |
| (ఏ) | గత 3 సంవత్సరాలలో సిబ్బందిని నియమించిన సంఘాలకు. | 0.040 |
| (బి) | 1959–60 లో సిబ్బంది నియమించే సంఘాలకు | 0.076 |
| | 4. పెద్ద తరహా సంఘాలకు గిడ్డంగులు | |
| (ఏ) | గత సంవత్సరాలలో ప్రారంభించిన గిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తిచేయడానికి | 1.020 |
| (బి) | 1959–60 లో ప్రారంభింప బోయే క్రొత్త గిడ్డంగులు | 0.300 |
| | 5. క్రయ విక్రయ సంఘాలచే గిడ్డంగులు | |
| (ఏ) | పాత గిడ్డంగులను పూర్తిచేయడానికి | 0.350 |
| (బి) | క్రొత్త గిడ్డంగుల నిర్మాణానికి | 0.750 |
| | మొత్తం | 3.986 |

## లేబరు కాంట్రాక్టు, ఫారెస్టు కూపు సహకార సంఘాలు

రెండవ ప్రణాళికాకాలంలో 15 లేబరు కాంట్రాక్టు, 15 ఫారెస్టు కూపు సహకార సంఘాలను ఏర్పాటు చేయడానికి లేదా పునరుద్ధరించడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1957–59లో ఋణాలు, సబ్సిడీలు రూపంలో ఆర్థికసహాయంచేసి, ఎరకానికి 5 సంఘాలు చొప్పున ఏర్పాటు చేయడం లేక అభివృద్ధి పరచడం జరిగింది. 1959–60లో లేబరు, గ్రాంటుల

రూపంలో ఆర్థిక సహాయం కలుగజేసి 5 ఫారెస్టు కూపుసహకార సంఘాలను, 6 లేబరు కాంట్రాక్టు సంఘాలను పునరుద్ధరించడం, పటిష్ఠం చేయడానికి ఉద్దేశింపబడింది. అందుకోసం రు. 0.47 లక్షల మొత్తం ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 5,000 రాజ్య స్థాయిలో నియమించబడే సాంకేతిక సిబ్బందికయ్యే ఖర్చుకోసం ప్రత్యేకించబడింది. మిగిలిన మొత్తం రు. 0.42 లక్షలో రు. 3,200/– లు ఆర్థిక సహాయం చేయడానికి ఈ జిల్లాలో వినియోగించబడతాయి. ఒక లేబరు కాంట్రాక్టు సంఘాన్ని పునరుద్ధరించడానికి గాను ఈ మొత్తంలో గ్రాంటుగా రు. 1200/- లు, ఋణంగా రు. 2,000/– లు ఇవ్వబడతాయి.

## *పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు*

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకారశాఖ ద్వారా అమలు జరుపబడ్డ వివిధ పథకాలవల్ల ప్రజలకు కలిగిన లాభాలను ఆ పథకాల నిర్వహణలో తెలియ వచ్చినలోటు పాట్లను పరిశీలించటానికి, సూత్రవిధానాలను రూపొందించడానికి ఏవైనా లోటుపాట్లు ఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించటానికి, ఈ విభాగం కృషిచేస్తుంది. 1957–58 లో ఈ పథకం అమలు జరుపబడింది. దానిననుసరించి జిల్లాలలో 20 నుండి సీనియరు ఇనస్పెక్టర్లను నియమించటం, గణాంక వివరాలను సేకరించి, సంకలనం చేయడం కోసం ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958–59 లో కూడా కొనసాగింపబడింది.

1959–60 లో, జిల్లాలలోని సిబ్బందికి సలహానిచ్చి, అజ్మాయిషీ వహించడం కోసం రిజిస్ట్రారు ఆఫీసులో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జూనియరు ఇన్స్పెక్టర్లను, ఇద్దరు జవానులను క్రొత్త సర్కిళ్ళకోసం 12 మంది సీనియర్ ఇన్స్పెక్టర్లను, ఒక్కొక్క సర్కిలు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46 మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించడానికి ఉద్దేశింపబడింది. క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పెట్టడానికి కార్యక్రమాన్ని ఏర్పాటు చేయటానికి వీలుగా ఉండేటందుకు సహకార శాఖలో పరిశోధన, పరిశీలన ప్రచార విభాగం కూడా నెలకొల్పబడింది. ప్రారం

భంలో ఈ విభాగానికి ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లు, ముగ్గురు జవానులతో కూడిన కొద్దిపాటి సిబ్బందిని నియమించడానికి ఉద్దేశింపబడింది. పై కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.34 లక్ష, హెడ్ ఆఫీసులో నియమించడానికి ఉద్దేశింపబడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రిందా, ప్రచారం మొదలైన వాటి కయ్యే ఖర్చు క్రిందా ప్రత్యేకించబడింది. మిగిలిన రు. 1.36 లక్షల కేటాయింపులోను రు. 9,087 ల మొత్తం ఈ జిల్లాలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద కేటాయించబడింది.

## సభ్యులు, పంచాయతీదారులు మొదలైన వారికి శిక్షణ

ఈ పథకం, అఖిల భారత సహకార సమాఖ్య ద్వారా భారత ప్రభుత్వం వారు ప్రారంభించిన పథకపు పద్ధతి మీద రూపొందించబడింది. సహకార సూత్రావళి, వాటి ఆచరణ, లెక్కలను వ్రాసి యుంచడం, సంస్థల నిర్వహణ మొదలైన విషయాలలో రెండు మూడు రోజులపాటు గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు, సుమారు ఒక వారంరోజులు, పంచాయతీదారులకు, సుమారు 5 నుండి 6 వారాలపాటు సంఘాల కార్యనిర్వాహకులకు, జీతం మీద పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1959-60 లో ఈ జిల్లాలోని 1000 మంది సభ్యులకు, 300 పంచాయితీదారులకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ ఇచ్చేటందుకు రు. 5856/- ల మొత్తం కేటాయించబడింది.

## సహకార వ్యవసాయం

సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయడం ద్వారాను వాటా మూలధనం క్రింద, ఎద్దుల కొనుగోలుకు, భూమిని బాగుచేయడానికి, వ్యవసాయ పనిముట్లకొనుగోలుకు ఋణాలు, గ్రాంటుల రూపంలో ఆర్థిక సహాయాన్ని కలుగజేయడం ద్వారా భూమిలేని పేద రైతులకు పునరావాసం కల్పించడానికి ఈ పథకం క్రింద ఉద్దేశింపబడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రు. 0.88 లక్ష— మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించబడ్డాయి. అందులో రు. 0.28 లక్ష మొత్తం, సహకార సేద్యానికి సంబంధించిన పని కోసం ప్రధాన కార్యాలయంలో నియమించబడిన సిబ్బందికయ్యే ఖర్చు

క్రింద వినియోగింప బడుతుంది. మిగిలిన మొత్తంలో రు. 11,500/—లు ఈ జిల్లాకు కేటాయించబడ్డాయి. అందులో 5,000 ఇంతకు ముందు ఏర్పరచిన సంఘాల సిబ్బంది ఖర్చు క్రింద, రు. 6,500/—లు ఈ సంవత్సరంలో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలకు ఆర్థిక సహాయాన్ని కలుగజేయడానికి గాను ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో ఈ సంవత్సరం 500 మంది సభ్యులతో ఒక క్రొత్త సంఘం ఏర్పాటు చేయబడి 1000 ఎకరాల భూమి సాగుచేయబడుతుంది.

## *రాజ్యా గిడ్డంగి కార్పొరేషను*

దేశంలో గిడ్డంగులను అభివృద్ధి పరచాలనే విషయాన్ని గురించి అనేక కమిటీలు, కమిషన్లు నొక్కి చెప్పాయి. పరపతి, పరపతేతర సంఘాల కార్యకలాపాలకు సంబంధాన్ని కలుగజేసే ముఖ్యమైన సంస్థలే గిడ్డంగులు. అందువల్ల, భారత ప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషనును స్థాపించారు. దీనికి అనుబంధంగా రాజ్య ప్రభుత్వాలను తమ తమ రాజ్యాలలో గిడ్డంగి సంస్థలను ఏర్పాటు చేయవలసిందిగా కేంద్రప్రభుత్వంవారు సలహా నిచ్చారు. ఇవి గిడ్డంగుల బోర్డు అధ్వర్యం క్రింద పనిచేస్తాయి. గిడ్డంగి రసీదులు నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్లుగా పరిగణింప బడతాయి. వాటిని ధరావతుగా ఉంచుకొని బ్యాంకులు, గిడ్డంగులలో వ్యవసాయ ఫలసాయాన్ని దాచుకొనే వారికి బ్యాంకులకు పరపతి సౌకర్యాన్ని కలుగచేస్తాయి. అందువల్ల 1958—59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఈ రాజ్యంలో స్థాపించబడింది. కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద ప్రభుత్వం వారు రు. 2.50 లక్షలమొత్తం పెట్టుబడి పెట్టారు. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో మరొక రు. 5 లక్షలు ఈ కార్పొరేషనుకు వాటా మూలధనంక్రింద పెట్టుబడి పెట్టడానికి కేటాయించారు. ఈ పథకం క్రింది ప్రయోజనాలు ఈ జిల్లాలోని రైతులకు కూడా లభ్యమౌతాయి.

## జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 మార్చి నెలాఖరుకు ఈ జిల్లాలో 9 మొదటిదశ బ్లాకులు, 2 రెండవ దశ బ్లాకులు, ఒక సామాజికాభివృద్ధి బ్లాకు, 1 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకు ఉన్నాయి.

# చిత్తూరు జిల్లా

1.4.59 తేదీనాటికి ఉన్న సాముహిక అభివృద్ధి ప్రాంతాలు






వీటి మొత్తం వైశాల్యం 2233.21 చ. మై. ఈ బ్లాకులలో 643 గ్రామాలు ఉన్నాయి. ఇందు నివశించే జనాభా 8,70,067. భారత ప్రభుత్వం వారి నిర్ణయం ప్రకారం 1959 ఏప్రిలు నుండి ఏర్పరచబడే ప్రతి బ్లాకులోను వ్యవసాయరంగంలో ప్రత్యేకంగా ప్రీ-ఎక్స్టెన్షన్ (పూర్వవిస్తరణ) కార్యక్రమం ఒక సంవత్సరం పాటు అమలు జరిగి ఉండాలి. ఈ నిర్ణయాన్ని అనుసరించి ఈ జిల్లాలోని నందిగామ బ్లాకులో 1.4.1958 న పై కార్యక్రమం ప్రారంభించబడింది. 1.4.1958 వ తేదీన పై కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 1.4.59 తేదీన మొదటి దశబ్లాకుగా రూపొందింది. ఇంతేకాక తిరువూరు సామాజికాభివృద్ధిబ్లాకు రెండవదశబ్లాకుగా ఏర్పడింది. 1959-60 లో ఈ రాజ్యానికి 36 పూర్వ విస్తరణ బ్లాకులు కేటాయించబడ్డాయి. అందులో 18 బ్లాకులు 1.4.59 తేదీన, మిగిలినవి 2.10.59 తేదీన ప్రారంభించబడ్డాయి. ఈ 36 బ్లాకులలో 2 బ్లాకులు ఈ జిల్లాకు కేటాయించబడ్డాయి. అవి మందవల్లి (1.4.59), పెనుగంచిప్రోలు (2.10.59) లలో ప్రారంభించబడ్డాయి. ఆ విధంగా మొదటి దశబ్లాకులు 10, రెండవ దశ బ్లాకులు 4, ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకు ఒకటి 1-4-59 తేదీ నాటికి ఈ జిల్లాలో ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలుపరచడంకోసం రు. 20,40,400ల మొత్తం కేటాయించబడింది. ఇందులో ఋణాల పద్దుక్రింద రు. 6,74,600/—లు, గ్రాంటుపద్దుక్రింద రు. 13,65,800/-లు, ఈ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడ్డాయి.

1—4—1959 వ తేదీనాటికి ఈ జిల్లాలో వున్న బ్లాకులను చూపే పటం ఈ ప్రక్క పుటలో ఇవ్వబడింది.

# పంచాయితీలను పటిష్ఠం చేయటం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో పంచాయతీ పాలనకు సంబంధించిన పర్యవేక్షక సిబ్బందిని, ఫీల్డు సిబ్బందిని 1958–59 లో పునర్వ్యవస్థీకరించడం జరిగింది. జిల్లా పంచాయతీ ఆఫీసర్ల కార్యాలయాల్లోని సిబ్బందిని పెంచడంతో పాటు జిల్లా స్థాయిలో జిల్లా పంచాయతీ ఆఫీసరును, రెవిన్యూ డివిజను స్థాయిలో డివిజనలు పంచాయతీ ఆఫీసరును, తాలూకా స్థాయిలో (బ్లాకు ప్రాంతాలు మినహా) డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లను ఏర్పాటు చేయడం ద్వారా ఈ పునర్వ్యవస్థీకరణ జరిగింది. 1959–60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.120 లక్ష మొత్తం స్థానిక పరిపాలన శాఖ ఇనస్పెక్టరు జనరలు కార్యాలయంలో నియమించబడ్డ అదనపు సిబ్బందిని కొనసాగించడానికి, రు. 0.191 లక్ష మొత్తం ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల (పశ్చిమం, తూర్పు) కార్యాలయాలలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి ప్రత్యేకించబడింది. ఖర్చు ఎక్కువ జరిగే జిల్లాలకు పంచేటందుకు రు. 0.524 లక్ష మొత్తం స్థానిక పరిపాలనశాఖ ఇనస్పెక్టర్ జనరలు వద్ద వుంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షల మొత్తంలో రు. 0.3220 లక్ష మొత్తం 1958–59 లో ఈ జిల్లాలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి కేటాయించ బడింది.

## శిక్షణ పథకం

ఈ పథకం క్రింద, సామర్లకోట, రాజేంద్ర నగరులలో వున్న రెండు ఎక్స్‌టెన్షన్ ట్రైనింగు సెంటర్లలోను, డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీల ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలక విషయాలలో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింపబడింది. జట్టుకు 40 మంది ఉద్యోగులకు చొప్పున జట్లు, జట్లుగా ఈ శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ సుమారు రెండు మాసాలపాటు ఇవ్వబడుతుంది. మొత్తం మీద సుమారు 390 మంది ఆఫీసర్లకు 1959–60 లో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశింప బడింది. అందుకు రు. 2.90 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించ

బడింది. జిల్లాలలోని ఆఫీసర్లకు కూడా ఈ పథకం క్రింద శిక్షణ ఇవ్వ బడుతుంది.

## బహుళార్థ సాధక ప్రాజెక్టు

### నాగార్జున సాగర్ ప్రాజెక్టు

నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు రెండవ ప్రణాళికలో కేటాయించ బడిన రు. 3,230 లక్షల మొత్తంలోను, డాముకు, కుడి, ఎడమ కాలువకు సంబంధించిన పనికోసం ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలలో రు. 1099.61 లక్షల మొత్తం కేటాయించబడింది. 1958–59 లో రు. 700 లక్షలు (ఈ మొత్తం ఇటీవల రు. 850 లక్షలకు పెంచబడింది.) ఈ ప్రాజెక్టు పనిని కొనసాగించడానికి కేటాయించబడింది. ఈ మొత్తం అంతా ఖర్చు కాగలదని తలంచబడుతున్నది. ఈ ప్రాజెక్టుమీద పనిని 1959–60 లో కూడా కొనసాగించడానికి రు. 700 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పెద్దతరహా, మధ్యతరహా నీటి పారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల కోసం 1959–60 లో రు. 4.36 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడ్డాయి.

| వరుస సంఖ్య. | ప్రాజెక్టు పేరు | 1959–60 లో కేటాయింపు (రూ. లక్షలలో) | పని | నీటిపారుదల జరిగే విస్తీర్ణం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | కృష్ణా రెగ్యులేటరు, రోడ్డు బ్రిడ్జి | 4.36 | పట్టర్లను బిగించడం. | 16,000 |

## విద్యుచ్ఛక్తి

### మాచ్ ఖండ్ జల విద్యుత్ పథకం

### (బకాయి పథకాలు క్రొత్త పథకాలు)

1957–58 కి పూర్వం ఒక్కొక్కటి 17,000 కిలోవాట్ల శక్తిగల 3 జనరేటింగు యూనిట్లు (విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు) పనిచేయడం

ప్రారంభమైంది. ఒక్కొక్కటి 21,250 కిలోవాట్ల శక్తిగల మిగిలిన రెండు యూనిట్లను నెలకొల్పే పని కూడా 1957–58 లో ప్రారంభించబడింది. 21,250 కిలోవాట్ల శక్తిగల ఆరవ యూనిట్‌తోపాటు ఈ రెండు యూనిట్లు గూడా 1958–59 లో ప్రారంభించబడతాయని మొదట్లో ఆశించడం జరిగింది. కాని మాచ్‌ఖండ్ వద్ద జరిగిన సమ్మె మూలంగా 21,250 కిలోవాట్ల శక్తిగల నాల్గవ యూనిట్ మాత్రమే 1959 జనవరి మాసంలో ప్రారంభించబడింది.

ఐదో యూనిట్ కూడా 1959–60లో పనిచేయడం ప్రారంభమవుతుందని ఆశించబడుతున్నది. ఆరవ యూనిటు స్థాపించడానికి సంబంధించిన పని, నాలుగవ, ఐదవ యూనిట్ల స్థాపనతోపాటు ప్రారంభించబడింది. 1959–60 లో అది పనిచేయడం ప్రారంభంఅవుతుందని కూడా ఆశించబడుతున్నది. జాలాపుట్ డాం సర్‌ప్లస్ కోర్సును పూర్తిచేయడానికి, ఐదవ, ఆరవ జనరేటింగు యూనిట్ల స్థాపనకు, చిన్నచిన్న ఇతర బకాయి పనులకు సంబంధించిన పనుల కోసం 1959–60 లో ప్రణాళికలో రు. 79.07 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ రు. 79.07 లక్షల మొత్తంలోను రు. 10.83 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ పథకం పూర్వపు ఆంధ్రరాష్ట్రంలోని జిల్లాలు అంటే శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల అవసరాలనుప్రస్తుతం తీరుస్తున్నది.

## ఎగువ సీలేరు జల విద్యుత్ పథకం

ప్రథమదశ క్రింద 60,000 కిలోవాట్ల శక్తిగల 2 జనరేటింగుయూనిట్లు (విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు) స్థాపించడం ద్వారా సీలేరు నది ఎగువ భాగం వద్ద విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు ఈ పథకం ఉద్దేశిస్తున్నది. పథకానికి సంబంధించిన వివరమైన పరిశీలన పూర్తి చేయబడింది. క్యాంపులను, రాకపోకలను ఏర్పాటుచేసే ప్రాథమిక కార్యాలు సాగుతున్నాయి. ఈ సంవత్సరంలోనే ఈ పథకపు పనిని ప్రారంభించడానికి ఉద్దేశింపబడింది. 1959–60లో కేటాయించబడ్డ రు. 73.00 లక్షలమొత్తం, క్యాంపుల నిర్మాణం, పునాదులు త్రవ్వడానికి, మట్టిగట్లు మొదలైనవి వేయడంవంటి సివిలు పనులకే ప్రధానంగా ఉద్దేశించబడింది. పై కేటాయింపులో, రు. 10 43 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

### గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం కేవలం గ్రామీణ విద్యుతీకరణకే కాకుండా గరివిడిలోని ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ, నాగార్జునసాగర్‌కు సంబంధించిన పనులకు కూడా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి ఉద్దేశించబడింది. రు. 10 లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణ పనులను కూడా అమలుపరచటం జరుగుతుంది. 1959–60 లో ఆంధ్రప్రాంతంలోని 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడంకోసం రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 20.0 లక్షల మొత్తం 20 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

### చిన్నతరహా పరిశ్రమలు

### విజయవాడలో పోతపనికి సంబంధించిన శిక్షణ-ఉత్పత్తి కేంద్రం

పోతపోసే పనిలో మేలురకం విధానాలను గురించి పనివారికి శిక్షణ యిచ్చేటందుకు 1956–57 లో విజయవాడలో ఉత్పత్తి-శిక్షణ కేంద్రం ఒకటి నెలకొల్పబడింది. అది అద్దె భవనంలో పనిచేస్తున్నది. ఈ కేంద్రంలో ఏటా 12 మందికి శిక్షణ ఇవ్వడానికి ఏర్పాటు చేయబడింది. ఒక్కొక్కరికి నెలకు రు. 30 లు స్టయిఫండు ఇవ్వబడుతుంది. శిక్షణ పొందేవారు శిక్షణ పూర్తి అయిన తర్వాత ఇంజనీరింగు వర్కుషాపుల్లో ఉద్యోగం సంపాదించుకోగలుగుతారు. మొత్తం 24 మంది రెండు జట్లుగా ఇంత వరకు శిక్షణ పొందారు.

ఈ కేంద్రం కోసం క్రిందటి సంవత్సరంలో పారిశ్రామిక క్షేత్రంలో ప్రారంభించిన శాశ్వత భవనాల నిర్మాణం ఈ సంవత్సరం పూర్తి అవుతుంది. నిర్మాణం పూర్తి కాగానే కేంద్రం దాంట్లోకి మార్చబడుతుంది. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.32 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తం నిర్మాణంలో ఉన్న భవనాలను పూర్తిచేయడానికి ఈ కేంద్రాన్ని కొనసాగించి మరొక 12 మందికి శిక్షణ ఇచ్చేటందుకు వినియోగించబడుతుంది. ఈ కేంద్రం వల్ల రు. 30,000 లు రాబడి ఉంటుందని అశించబడింది.

## విజయవాడలో చర్మపరిశ్రమకు సంబంధించిన నమూనా కేంద్రం

స్థానికంగా ఉండే నిపుణులైన చర్మకారులను నియమించి వ్యాపారం కోసం మేలురకం, క్రొత్త రకం తోలు వస్తువులను తయారు చేసే ఉద్దేశం తోను, ఒక్కొక్కరికి నెలకు రు. 30 ల స్టయిఫండు మీద ఏటా 12 మందికి శిక్షణగరిపేటందుకుగానువిజయవాడలో ఒక నమూనా తోలువస్తువుల తయారీకి సంబంధించిన నమూనా కేంద్రంఒకటి 1956–57 లో స్థాపించబడింది. అది అద్దెభవనంలో పని చేస్తున్నది. ఇంతవరకు 24 మందికి శిక్షణ యివ్వబడింది.

ఈ కేంద్రంకోసం క్రిందటి సంవత్సరం విజయవాడ పారిశ్రామిక క్షేత్రంలో ప్రారంభించిన భవనాల నిర్మాణాన్ని పూర్తి చేయడానికి, ఈ కేంద్రాన్ని కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ 0.75 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో ఈ కేంద్రం శాశ్వత భవనాలలోకి మార్చబడగలదని ఆశించబడుతున్నది. మరి 12 మంది అభ్యర్థులకు కూడా శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ సంవత్సరంలో ఈ కేంద్రం నుండి రు. 60,000 ఆదాయం ఉండగలదని ఆశించబడుతున్నది.

## విజయవాడలో సైకిలు విడి భాగాల తయారీ

సైకిలు విడి భాగాలు మొదలైనవి తయారు చేయడానికిగాను విజయవాడలో ఒక చిన్న ఉత్పత్తి కేంద్రాన్ని నెలకొల్పడానికి, సైకిలు విడి భాగాలు తయారు చేయడంలో ఒక్కొక్కరికి నెలకు రు. 30 స్టయిఫండు యివ్వటం ద్వారా ఆరుగురు పనివారికి శిక్షణ ఇవ్వడానికి తలపెట్టబడింది.

ఈ కేంద్రం కోసం విజయవాడ పారిశ్రామిక క్షేత్రంలో క్రిందటి సంవత్సరం ప్రారంభించిన శాశ్వతభవనాల నిర్మాణం ఈ సంవత్సరంలో పూర్తి చేయబడుతుంది. దిగుమతి చేయబడే రెండు యంత్రాలు మినహా ఈ కేంద్రానికి కావలసిన యంత్రాలు, పరికరాలు కొనబడ్డాయి. ఇతరదేశాల నుండి దిగుమతి చేయబడే యంత్రాలకోసం విదేశీమారకం ద్రవ్యం లభ్యం చేయబడింది. ఈ సంవత్సరంలోనే యంత్రాలు లభ్యం కాగలవు. నిర్మాణంలో ఉన్న భవనాలను పూర్తిచేయడానికి, దిగుమతి చేయబడే యంత్ర సామాగ్రి కొనుగోలుకు, కేంద్రం పని చేయడానికి 1959–60 ప్రణాళికలో రు. 1.61

లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో నేతః యూనిటు పని చేయడం ప్రారంభిస్తుంది. శిక్షణపొందడానికి ఆరుగురితో కూడిన మొదటి జట్టు అభ్యర్థులు ఈ సంవత్సరంలో చేర్చుకోబడతారు. ఈ కేంద్రంవల్ల రు. 1,00,000 ఆదాయం రాగలదని ఆశించబడుతున్నది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయ చట్టం క్రింద ఋణాలు

ప్రణాళికలోని మొదటి 3 సంవత్సరాలలో పరిశ్రమలకు ప్రభుత్వ సహాయచట్టం క్రింద చిన్నతరహా పరిశ్రమలకు ఋణాల రూపంలో రు.13.11 లక్షల మొత్తం పంచిపెట్టబడింది. ఈ సంవత్సరంలో పరిశ్రమలకు ఋణాలుగా మరొక రు. 7 లక్షల మొత్తం ఇవ్వబడుతుంది. ఈ జిల్లా లోని పారిశ్రామికులకు కూడా ఈ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## పారిశ్రామిక, వాణిజ్యశాఖను పటిష్ఠం చేయడం

రెండవ ప్రణాళికా కాలంలో పారిశ్రామిక వాణిజ్యశాఖలో పనిబాగా పెరిగింది. అందువల్ల రు. 7.95 లక్షల వ్యయంతో డైరెక్టరు కార్యాలయంలోను, జిల్లాలలోనూ కూడా సిబ్బందిని పెంచడానికి ఉద్దేశించబడింది. రెండవ ప్రణాళికలో ఈ మొత్తం కేటాయించబడింది. మొదటి మూడు సంవత్సరాలలో రు. 3.45 లక్షల మొత్తం వ్యయంతో అదనపు సాంకేతిక సిబ్బంది, మినిస్టీరియల్ సిబ్బందికూడా నియమించబడింది. ఈ సంవత్సరంలో ఇంతకు ముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, మరికొంత అదనపు సిబ్బందిని నియమించడానికి ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకు ప్రాంతాల్లో నియమించబడిన పారిశ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల జీతాలు

బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పారిశ్రామిక శాఖ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో రు. 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సర ప్రణాళికలో ఇందుకోసం రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

### పారిశ్రామిక, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులు

తలపెట్టిన అనేక పథకాలను త్వరితంగాను, కట్టుదిట్టంగాను అమలు పరచాలంటే వాటికి సంబంధించిన అధికారులు తరచు పర్యవేక్షణ జరపడం, సాంకేతిక సహాయం అందచేయడం అవసరం. ఈ అధికారులు త్వరితంగా పర్యటించడానికి వీలుగా వీరికి జీపులను సరఫరా చేయడం అవసరం అని భావించబడింది. 1958—59 చివరకు ఆంధ్రప్రాంతంలోని పారిశ్రామిక, వాణిజ్య శాఖ అసిస్టెంటు డైరెక్టర్లందరికి జీపులు ఇవ్వబడ్డాయి. ఈ సంవత్సరంలో రు. 0.30 లక్ష మొత్తం ఈ జీపుల నిర్వహణకు కేటాయించబడింది. ఒక జీపు ఈ జిల్లాలో అసిస్టెంటు డైరెక్టరు క్రింద ఉన్నది.

### విజయవాడలో చిన్నతరహా, కుటీర పరిశ్రమల పరిశోధన కేంద్రం

క్రొత్త యంత్రాలను, పరికరాలను రూపొందించడం ద్వారాను సాధ్యమైన చోట్ల క్రొత్త పద్ధతుల్ని అవలంబించడం ద్వారాను చిన్నతరహా కుటీర పరిశ్రమలను అభివృద్ధిపరచే ఉద్దేశంతో ఒక పరిశోధన కేంద్రాన్ని ఏర్పాటు చేయడానికి ఉద్దేశించబడింది. దీనికోసం విజయవాడ పారిశ్రామిక క్షేత్రంలో శాశ్వత భవనాల నిర్మాణం సాగుతున్నది. 1958—59 లో కొన్ని యంత్రాలను కూడా కొనడం జరిగింది.

భవనాల నిర్మాణాన్ని పూర్తి చేసేటందుకు, మిగిలిన యంత్రాలు, పరికరాల కొనుగోలుకు, కేంద్రం నిర్వహణకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.85 లక్ష మొత్తం కేటాయించబడింది.

## పారిశ్రామిక క్షేత్రం

### విజయవాడలో పారిశ్రామిక క్షేత్రం

ఈ క్షేత్రం కోసం, 53.93 ఎకరాల భూమి సేకరించబడింది. ఈ క్షేత్రంలో కట్ట తలపెట్టిన 18 ఫ్యాక్టరీ భవనాలలోను 10 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం మొదటి దశలో ప్రారంభించబడి, 1959 మే నెలఆఖరుకు పూర్తి చేయబడింది. 1957—58, 1958—59 సంవత్సరాలలో రు. 12.29 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. ఈ సంవత్సరంలో మిగిలిన 8 ఫ్యాక్టరీ భవనాల నిర్మాణం పూర్తిచేయబడుతుంది. అందుకోసం రు. 9.00 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది.

## హస్తకళలు

### విజయవాడ కేంద్ర క్రయవిక్రయశాలలో అంతర్రాజ్యా విక్రయ విభాగం

అంతరాష్ట్రీజ్య క్రయవిక్రయాలను ప్రోత్సహించే ఉద్దేశంతో 1958–59 లో విజయవాడలోని కేంద్ర విక్రయశాలలో అంతర్రాజ్య క్రయవిక్రయ విభాగం నెలకొల్పబడింది. అది 1959–60 లో కొనసాగించబడుతుంది. అందుకు రు. 0.22 లక్ష మొత్తం కేటాయించబడింది. 1958–59 లో రు. 0.69 లక్ష విలువచేసే సరకు ఈ విభాగం ద్వారా అమ్మబడింది. 1959–60 లో ఈ విభాగం ద్వారా రు. 1.00 లక్ష మొత్తం విలువ చేసేసరకు అమ్ముడుపోగలదని ఆశించబడుతున్నది.

### కొండపల్లి బొమ్మలు

కొండపల్లిలో బొమ్మలు చేసుకొనేవారికి సహకార సంఘాలను ఏర్పరచే ఉద్దేశంతోను, క్రొత్తవారికి శిక్షణ గరిపే ఉద్దేశంతోను 1958–59 లో ఈ పథకం అమలుపరచబడింది. 11 మందికి శిక్షణ ఇవ్వబడింది. అది ఈ సంవత్సరం కూడా కొనసాగించబడుతుంది. రు. 0.10 లక్ష వ్యయంతో 12 మంది అభ్యర్థులకు శిక్షణ ఇవ్వబడుతుంది.

### మచిలీపట్నంలో కలంకారీ అద్దకం పరిశ్రమ అభివృద్ధి

కలంకారీ అద్దకం పరిశ్రమను పునరుద్ధరించి, అభివృద్ధి పరచడానికి 1958-59లో మచిలీపట్నంలో ఒక కలంకారీ అద్దకపు కేంద్రం నెలకొల్పబడింది. దానిని 1959–60 లో కొనసాగించడానికి ప్రణాళికలో రు. 0.07 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో ఈ కేంద్రంలో 4 గురు అభ్యర్థులు కూడా శిక్షణ పొందుతారు.

### బొబ్బిలి, జగ్గయ్యపేటలలో వాద్యా పరికరాల పరిశ్రమ అభివృద్ధి

వాద్య పరికరాలను తయారుచేసే పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు బొబ్బిలి, జగ్గయ్యపేటలలో 2 ఉత్పత్తి కేంద్రాలను స్థాపించడానికి తలపెట్టబడింది. బొబ్బిలిలో స్థాపించదలచుకొన్న కేంద్రం 1958–59 లో

నెలకొల్పబడింది. ఈ సంవత్సరంలో రు. 0.13 లక్ష ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 0.05 లక్ష మొత్తం బొబ్బిలిలోని కేంద్రాన్ని కొనసాగించడానికి, రు. 0.08 లక్ష జగ్గయ్యపేటలో కేంద్రాన్ని స్థాపించడానికి ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో ఈ కేంద్రం సహకార పద్ధతులమీద కూడా నిర్వహించబడుతుంది.

## క్రొత్త పథకాలు

ఈ సంవత్సరంలో రాజ్య స్థాయిలో హస్తకళలకు సంబంధించిన ఈ క్రింది క్రొత్త పథకాలు అమలుపరచబడతాయి. వీటివల్ల కలిగేలాభాలు ఆంధ్రప్రాంతంలోని జిల్లాలన్నిటికి లభిస్తాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959–60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | హస్తకళలకు ఉపయోగించేటందుకు దేవాలయాలలోని డిజైనులను కాపీచేయడానికి | 0 05 |
| 2. | విడివిడిగా ఉంటూ, సహకార సంఘాలుగా ఏర్పరచడానికి వీలులేని పనివారికి గ్రాంటులు, ఋణాలు యివ్వడానికి | 0.05 |

## మచిలీపట్టణంలో కలంకారి పరిశ్రమకు సంబంధించిన ఉమ్మడి సౌకర్యాల కేంద్రాన్ని స్థాపించటం

మచిలీపట్నంలో కలంకారీ పరిశ్రమకు సంబంధించిన ఉమ్మడి ఉత్పత్తి సౌకర్య కేంద్రాన్ని నెలకొల్పడం కోసం 1959–60 ప్రణాళికలో రు. 0.05 లక్ష మొత్తం కేటాయించబడింది.

## విజయవాడ రైల్వే స్టేషనులో హస్తకళల షోకేసులు

విజయవాడ రైల్వేస్టేషనులో హస్తకళల షోకేసులను ఏర్పాటు చేయడంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 0.01 లక్ష మొత్తం కేటాయించబడింది.

## గ్రామీణ పరిశ్రమలు

### బెల్లం, ఖండసారి పథకాలు

ఈ పథకం క్రింద మంచిరకం బెల్లాన్ని, ఖండసారీని తయారు చేయడంకోసం రైతులు మేలురకం ఉపకరణాలను కొనుక్కోవడానికిగాను వడ్డీ లేకుండా ఋణాలు ఇవ్వబడతాయి. ఉత్పత్తి చేసే విధానాలు కూడా ప్రదర్శనపూర్వకంగా తెలియచేయబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాలలో వసూలు చేయబడతాయి. ఈ పథకం అనకాపల్లి, నోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో మొదటి ప్రణాళికా కాలం (1955)లో అమలు పరచబడింది. బెల్లాన్ని, ఖండసారిని అధునిక పద్ధతులలో ఉత్పత్తి చేయడంలో శిక్షణ పొందిన ప్రత్యేక ఫీల్డు సిబ్బందిని నియమించడం ద్వారా ఈ పథకం అమలు పరచబడింది. ఈ పథకం 1956–57, 1957–58 సంవత్సరాలలో కొనసాగించబడింది. కాని ఇది 1958–59లో అమలుపరచబడలేదు. ఈ సంవత్సరంలో, ప్రస్తుతం అమలుజరుగుతున్న ప్రదేశాలలో కొనసాగిస్తూ, శ్రీకాకుళం జిల్లా పాలకొండ, పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు, కృష్ణాజిల్లా దివి, గుంటూరు జిల్లా రేపల్లె, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలకు ఈ పథకాన్ని విస్తరింప జేయడానికి ఉద్దేశింపబడింది. ఇప్పటికే ఈ పథకం క్రిందికి 32,650 ఎకరాలమేర తీసుకురాబడింది. ఈ పథకం క్రింది కార్యక్రమాలను క్రొత్తప్రాంతాలకు విస్తరింప చేయడంవల్ల మరో 30,000 ఎకరాలమేర ఈ పథకం క్రిందికి తీసుకురాబడుతుంది. ప్రస్తుతం పారిశ్రామిక శాఖ అజ్మాయిషీ క్రింద ఉన్న ఈ పథకాన్ని 1958 నవంబరులో ఏర్పాటు చేయబడ్డ ఆంధ్రప్రదేశ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డు అజ్మాయిషీకి మార్చడానికి తలపెట్టబడింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరంలో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## *1948* సంవత్సరపు కుటీర పరిశ్రమల ఋణాల నియమావళి క్రింద ఋణ సహాయం

వడ్రంగం, కమ్మరం, నేత మొదలైన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలు చేసుకుంటున్న పనివారికి ఆర్థికసహాయాన్ని కలగజేయాలనే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాలలో ఋణాలుగా

రు. 1.64 లక్షల మొత్తం పంపిణీ చేయబడింది. 1958-59 లో ఈ పథకం అమలు పరచబడలేదు. ఈ సంవత్సరంలో రు. 2.00 లక్షల వరకు ఋణా లను ఇవ్వడానికి తలపెట్టబడింది. ఈ జిల్లాలోని పనివారికి కూడా ఈ పథకం క్రింద ఋణాలు ఇవ్వబడతాయి.

### *పారిశ్రామిక సహకార వ్యవస్థలు*

గ్రామీణ పరిశ్రమలు అన్నీ ఏకమై, వాటి ఉత్పత్తి విధాలను మెరుగు పరచుకొని తద్వారా ఉత్పత్తిని అధికం చేసుకోవడానికి వీలుకలగజేయడమే ఈ పథకం ఆశయం. ఇందుకోసం సహకార సంఘాల ద్వారా దంపుడుబియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచడానికి 10 కేంద్రాలను ప్రారంభించడం, కలంకారీ అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, సిబ్బంది ఖర్చుల క్రింద గ్రాంటులు ఇవ్వడం, మేలురకం పనిముట్లను కొనుక్కోవటానికి గుంటూరు కమ్మరి పనివారి సహకార సంఘానికి ఆర్థిక సహాయాన్ని కలుగజేయడం, పరికరాలు మొదలైనవి కొనుక్కోవడానికి కుటీర పారిశ్రామిక సహకార సంఘాలకు సబ్సిడీలను ఇవ్వడం మొద లయినటువంటి పథకాలు రూపొందించబడ్డాయి. ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం ఈ పథకం క్రింద ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరంలో ఈ పథకాన్ని కొనసాగించడానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడ్డ ఆంధ్రప్రదేశ ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డు అజ్మాయిషీ క్రిందికి దీనిని మార్చటానికి ఉద్దేశించబడింది.

## చేనేత పరిశ్రమ

### *చేనేత పనివారి సంఘాలకు వాటా మూలధనం, నిర్వాహణ మూలధనం క్రింద ఋణాలు*

చేనేత కార్మికుల సంఘాలలో వాటాలు తీసికొని, సభ్యులు కావ డానికి వీలు కలిగేటందుకు చేనేత కార్మికులకు ఋణాల నివ్వడానికి ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.30 లక్ష వాటా మూలధనం క్రింద అప్పులు ఇవ్వడానికి ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ సంవత్సరం ఈ జిల్లాలో 1000 క్రొత్త మగ్గాలు సహకార

వ్యవస్థ క్రిందికి తీసికొని రాబడతాయనీ, 100 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడుతున్నది.

## ఆంధ్ర చేనేత కార్మికుల సహకార సంఘం విస్తరణ

మరికొన్ని విక్రయ కేంద్రాలను ప్రారంభించడం ద్వారాను, చేనేత బట్టల విషయంలో తీవ్రమైన ప్రచారం జరపడం ద్వారాను ఆంధ్ర చేనేత కార్మికుల సహకార సంఘం కార్యకలాపాలను విస్తరింపజేయడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పథకంకోసం ఈ సంవత్సరంలో రు. 3.31 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.37 లక్ష మొత్తం ఈజిల్లాలో మరి రెండు విక్రయ కేంద్రాలను, ఒక కేంద్ర డిపోను ప్రారంభించడానికి గాను వినియోగించబడుతుంది. ఈ సంవత్సరంలో 10 లక్షల గజాల చేనేత బట్ట డిపోల ద్వారా అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి నిర్వాహణ ఖర్చు

అందరికినచ్చే డిజైన్లతో ఇంకా నాణ్యమైన మంచి రకాల బట్టను ఉత్పత్తి చేయడానికి, చేనేత పరిశ్రమ సాంకేతిక నైపుణ్యాన్ని మెరుగు పరచే ఉద్దేశంతోను ఈ పథకం, రెండవ ప్రణాళిక మొదటిమూడు సంవత్సరాలలో అమలుపరచబడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగు మిషన్లువంటి ఆధునిక పరికరాలు చేనేత కార్మికులకు సరఫరా చేయబడ్డాయి. ఈ సంవత్సరం ఆంధ్ర ప్రణాళికలో రు. 4.80 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.64 లక్ష, చేనేత కార్మికులకు 80 స్టాండర్డు రీడ్లను, 8 వార్పింగు మిషన్లను, 80 స్లేలను, 3 ప్రెస్ మిషనులను సరఫరా చేయడానికి, బట్ట నాణ్యాన్ని పెంపొందించడం కోసం నియమించబడ్డ ముగ్గురు సాంకేతిక సహాయకులను కొనసాగించడానికి కేటాయించబడింది.

## ముదరా

చేనేత బట్టవిక్రయాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా ఉత్పత్తిని పెంచేటందుకుగాను ఆంధ్రచేనేత సహకారసంఘం, ప్రాథమికచేనేత కార్మికుల సహకార సంఘాల విక్రయ శాలలచే అమ్మబడే చేనేత వస్త్రాల అమ్మకం మీద ముదరా ఇవ్వబడుతుంది. అమ్మకం మీద రూపాయకు 6 న. పై. లు

మామూలుగా ముదరా ఇవ్వబడుతుంది. కాని సంఘాలలో నిల్వ ఉండి పోయిన సరకును విక్రయించడానికి వీలుగా అప్పుడప్పుడు ప్రత్యేక ముదరా కూడా ఇవ్వబడుతున్నది. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 8.00 లక్షలు ఈ జిల్లాలో ముదరా ఇవ్వడానికి వినియోగించబడతాయి.

*కంబళి పరిశ్రమ*

ఆంధ్రప్రాంతంలో కంబళి పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.20 లక్ష మొత్తం, 50 మగ్గాలతో కంబళ్ళ నేతపనివారి సంఘం ఒకటి ఏర్పాటు చేయడానికి, ఈ సంఘానికి ఉన్ని కత్తిరించే యంత్రాన్ని సరఫరా చేయడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## రోడ్లు

*ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)*

ఆంధ్రప్రాంతంలోని బకాయి పనులను కొనసాగించడానికి 1959—60 లో రు. 2.93 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.991లక్ష ఈ క్రింది కార్యక్రమాల కోసం ఈ జిల్లాకు కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పనివివరం | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | ఏలూరు-కేతవరం రోడ్డు మై. 14/7 నుండి 18/3 వరకు కంకర వేయడం | 0.779 |
| 2. | ఏలూరు—కైకలూరు రోడ్డు మై. 0/0 నుండి 5/3 వరకు 400 కలిపి రోడ్డుకు కంకర వేయడం | 0.210 |
| 3. | కన్నికలమడుగు మీద ఏలూరు—నిడుమోలు—కేతవరం రోడ్డు మై. 1/5—6 వద్ద వంతెన నిర్మాణం | 0.001 |
| 4. | విజయవాడ—నూజివీడు రోడ్డు మై. 28/4 వద్ద బుడమేరుకు అడ్డుగా వంతెన నిర్మాణం | 0.001 |

## ప్రభుత్వ రోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతంలో ఈ పథకం కోసం 1959–60 లో రు. 41.69 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.855 లక్ష మొత్తం, ఈ జిల్లాలోని ఈ క్రింది పథకాల కోసం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959–60 లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | ఏలూరు–కైకలూరు రోడ్డు మై. 4/1–2 వద్ద వంతెన నిర్మాణం | 0.010 |
| 2. | కంకిపాడు-గుడివాడ రోడ్డు 1/2–9/4 కు తారు వేయడం | 0.045 |
| 3. | ఇబ్రహీంపట్నం – తిరువూరు రోడ్డు మీద మై. 30/5–6 వద్ద ముంపు వంతెన నిర్మాణం | 0.550 |
| 4. | గుడివాడ–చల్లపల్లి – నాగాయిలంక రోడ్డు మీద రివెట్ మెంట్లు, రిటైనింగు గోడలకు కేటాయింపులకు | 0.300 |
| 5. | మున్సిపలు హద్దులలోపల కంకిపాడు గుడివాడ రోడ్డు వెడల్పు చేయడం, 18'–0''ల వెడల్పు ప్రీకోటెడ్ చిప్పుతో రోడ్డు మీద గుంటలు పూడ్చడం; 15/0–16/6 వరకు 3'-0'' వెడల్పు మెటల్ షోల్డర్లు వేయడం | 0.150 |

## ప్రభుత్వం సాధీనం చేసుకున్న రోడ్లస్థాయిని పెంచడం

ఇంతకు ముందు ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న జిల్లాబోర్డు రోడ్ల స్థాయిని పెంచేటందుకు 1959–60 ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.90 లక్ష మొత్తం ఈ జిల్లాలోని ఈ క్రింది రోడ్ల స్థాయిని పెంచడంకోసం కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959-60 లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | మచిలీపట్నం—మంగినపూడి రోడ్డు యొక్క బండ్ల బాటను పటిష్టం చేయడం | 0.20 |
| 2. | వుయ్యూరు—ఇందుపల్లి—తెలప్రోలు రోడ్డు మీద వంతెనలు, కల్వర్టుల నిర్మాణం | 0.20 |
| 3. | ముదినేపల్లి—గుడ్లవల్లేరు రోడ్డుకు కంకర వేయడం | 0.50 |
| | మొత్తం | 0.90 |

## రోడ్డు ప్రక్క చెట్లు

రోడ్డు ప్రక్క చెట్లను అభివృద్ధి పరచటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

మొదటి ప్రణాళికాకాలంలో ప్రారంభించబడి ముగింపకుండా ఉన్నటువంటి పి.డబ్ల్యు.డి పనులను పూర్తి చేయడానికిగాను ఆంధ్రప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తిగ్రాంటును ఇవ్వడానికి 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఈ పథకం క్రింద కేటాయించబడింది. అందులో రు. 0.01 లక్ష మొత్త ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ఇతర రోడ్లు (క్రొత్తవి)

క్రొత్త పి. డబ్ల్యు. ఆర్. డి. పనులు ప్రారంభించడానికి ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు ఈ పథకం క్రింద సగం గ్రాంట్లు ఇవ్వబడతాయి. మిగిలిన సగం ఖర్చును జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల లాభం పొందేవారు భరించాల్సిఉంటుంది. 1959-60లో క్రొత్త పనులకుగాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు గ్రాంటు ఇవ్వడం కోసం రు. 6.00 లక్షలు కేటాయించబడ్డాయి. అందులో రు. 0.04 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనల నిర్మాణం, క్రొత్తగా గ్రామాలలోను, గ్రామాల మధ్య రోడ్లు వేయడం జరుగుతున్నది. జిల్లా కలెక్టర్లు ఈ పనుల ఎంపిక, నిర్వహణలలో అజ్మాయిషీ వహిస్తున్నారు. అయ్యే ఖర్చులో సగం ప్రభుత్వం వారు భరిస్తున్నారు. మిగిలింది పై పనులను నిర్వహించడంవల్ల లాభం పొందేవారు భరిస్తున్నారు. 1959–60 లో ఈ పథకం మీద ఆంధ్ర ప్రాంతంలో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టడానికి ఉద్దేశింపబడింది. అందులో రు. 0.972 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

# విద్య

## సాధారణ విద్య, ప్రాథమిక విద్య

ప్రాథమిక విద్యాభివృద్ధికోసం ఈ జిల్లాకు రు. 8.910 లక్షల మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించబడుతుంది.

### కొనసాగుతున్న పథకాలు

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (లక్షలు రూపాయలలో) |
|---|---|---|
| 1. | 1956–57 లో తెరవబడిన పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. స్థానిక సంస్థలు (5 పాఠశాలలు.) | 0.050 |
| 2. | 1957–58 లో తెరవబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు, స్థానిక సంస్థలు (22 పాఠశాలలు) | 0.220 |
| 3. | 1958–59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు. | |

| | | |
|---|---|---|
| | (ఎ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) | 0.020 |
| | (బి) ఎయిడెడ్ (5 పాఠశాలలు) | 0.030 |
| 4. | 1957–58 లో ప్రారంభించబడిన జూనియరు బేసిక్ పాఠశాలలు. | |
| | (ఎ) స్థానిక సంస్థలు (10 పాఠశాలలు) | 0.150 |
| | (బి) ఎయిడెడ్ (10 పాఠశాలలు) | 0.150 |
| 5. | 1958–59 లో ప్రాంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు. | |
| | (ఎ) స్థానిక సంస్థలు (4 పాఠశాలలు) | 0.020 |
| | (బి) ఎయిడెడ్ (4 పాఠశాలలు) | 0.030 |
| 6. | 1957–58 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చ బడిన ప్రాథమిక పాఠశాలలు | |
| | (ఎ) ప్రభుత్వం వారివి (ఎస్. డబ్ల్యు)<br>(బి) స్థానిక సంస్థలు (6 పాఠశాలలు)<br>(సి) ఎయిడెడ్ (9 పాఠశాలలు) | 0.002 |
| 7. | 1958–59 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు | |
| | (ఏ) ప్రభుత్వం వారివి (ఎస్. డబ్ల్యు)<br>(బి) స్థానిక సంస్థలు (25 పాఠశాలలు)<br>(సి) ఎయిడెడ్ (4 పాఠశాలలు) | 0.013 |
| 8. | ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలోని ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపు | 3.130 |
| 9. | 1958–59 లో జిల్లా బోర్డువారిచే స్వాధీనం చేసుకోబడిన ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలు | 1.200 |
| 10. | 1956–57 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు (16 సెక్షన్లు) | 0.080 |
| | (బి) ఎయిడెడ్ (17 పాఠశాలలు) | 0.050 |

| | | |
|---|---|---|
| 11. | 1957-58 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు | |
| | (ఏ) ప్రభుత్వం వారివి (ఒక పాఠశాల) | 0.080 |
| | (బి) స్థానిక సంస్థలు (12 సెక్షన్లు) | 0.120 |
| | (సి) ఎయిడెడ్ (2 పాఠశాలలు) 1 సెక్షను | 0.150 |
| 12. | 1957–58 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలు ఎయిడెడ్ (2 పాఠశాలలు) | 0.060 |
| 13. | 1958–59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షనులు (ప్రభుత్వానివి) (1 సెక్షను) | 0.050 |
| 14. | 1958–59 లో కొన్ని ప్రభుత్వ ట్రైనింగు పాఠశాలలో స్థాయిపెంచబడిన ప్రధానోపాధ్యాయుల పదవులు (1 పదవి) | 0.010 |
| 15. | 1956-57 లో సెకండరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లు | 0.010 |
| 16. | 1957–58 లో ఇన్స్పెక్టరేటులో నియమించబడిన గుమాస్తాలు, టైపిస్టులు (నాలుగు ఉద్యోగాలు) | 0.030 |
| 17. | 1958–59 లో నియమించబడిన సీనియరు డిప్యూటి ఇన్స్పెక్టర్లు, జవానులతో సహా (మూడు ఉద్యోగాలు) | 0.050 |
| 18. | మూడవ ఫారం వరకు ఉచిత విద్యా పథకాన్ని అమలు పరచడానికి ఇన్స్పెక్టరేట్లలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలు (ఇద్దరు గుమాస్తాలు) | 0.030 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 19. | విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించడానికి పథకం | 1.090 |
| 20. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (27 గురు ఉపాధ్యాయులు) | 0.130 |
| 21. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం | |
| | (ఎ) స్థానిక సంస్థలు (21 పాఠశాలలు) | 0.060 |
| | (బి) ఎయిడెడ్ (7 పాఠశాలలు) | 0.02 |
| 22. | స్త్రీ విద్యకు సంబంధించి కేంద్ర పథకం — హైయ్యర్ ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు పాఠశాల | 0.180 |
| 23. | 1958—59 మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (2 పాఠశాలలు) | 0.120 |
| 24. | మాధ్యమిక పాఠశాలలుగా హైయ్యర్ ఎలిమెంటరీ (ఎయిడెడ్) పాఠశాలలును మార్చడం (కంపెన్సేటరీ గ్రాంటు) (ఒక పాఠశాల) | 0.060 |
| 25. | 1958—59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంటులు | |
| | (ఏ) ఎయిడెడ్ (4 పాఠశాలలు) | 0.010 |
| | (బి) స్థానిక సంస్థలు (15 పాఠశాలలు) | 0.400 |
| 26. | మాధ్యమిక పాఠశాలల్లో (ఎయిడెడ్) అదనపు సెక్షనును ప్రారంభించడం. (5 పాఠశాలలు) కాంపెన్సేటరీ గ్రాంట్లు | 0 050 |
| 27. | 1958—59 లో ప్రారంభించబడిన ప్రాచ్య విద్యా మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు (ఒక సెక్షను) | 0.004 |
| | (బి) ఎయిడెడ్ (4 సెక్షన్లు, 1 పాఠశాల) | 0.070 |

| | | |
|---|---|---|
| 28. | ప్రభుత్వ పాఠశాలల్లో అదనపు (మాధ్యమిక) సెక్షన్లు ప్రారంభించడం (2 సెక్షన్లు) | 0.020 |
| 29. | బేసిక్ పద్ధతికి ట్రైనింగు పాఠశాలల్ని మార్చడం ప్రభుత్వానివి | 0.400 |
| 30. | ప్రభుత్వ బేసిక్ ట్రైనింగు పాఠశాలలలో అంబరు చర్ఖా పథకం (ఒక పాఠశాల) | 0.010 |
| 31. | జిల్లా విద్యా శాఖాధికారులకు జీపులు (3 జీపులు) | 0.310 |
| 32. | నందిగామలో ఒక ప్రభుత్వ బేసిక్ ట్రైనింగు పాఠశాలను ప్రారంభించడం | 0.250 |
| | మొత్తం | 8.919 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం ఈ జిల్లాకు రు. 1.715 లక్షల మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తం ఈ క్రింది విధంగా వినియోగించబడు తుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు (2 సెక్షన్లు) | 0.010 |
| | (బి) ఎయిడెడ్ (7 సెక్షన్లు, ఒక పాఠశాల) | 0.030 |
| 2. | 1957—58 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు (17 సెక్షన్లు) | 0.150 |
| | (బి) ఎయిడెడ్ (1 సెక్షను) | 0.010 |

| | | |
|---|---|---|
| 3. | 1957–58 లో హైయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చబడిన ఉన్నత పాఠశాలలు | |
| | (ఎ) ప్రభుత్వానివి (ఒక పాఠశాల) | 0.010 |
| | (బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల.) | 0.010 |
| 4. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలు | 0.050 |
| | (బి) ఎయిడెడ్ | 0.020 |
| 5. | హైయ్యర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు | |
| | (ఎ) స్థానిక సంస్థలు (ఒక పాఠశాల) | 0.200 |
| | (బి) ఎయిడెడ్ (ఒక పాఠశాల) | 0.030 |
| 6. | సెకండరీ పాఠశాలల్లో ఉపాధ్యాయుల జీతాలు హెచ్చింపుకు | 0.700 |

## క్రొత్త పథకాలు

| | | |
|---|---|---|
| 7. | 1958–59 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షన్లకు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0.050 |
| 8. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగా మార్చడం-సెకండరీ, పాఠశాలల్లో అదనపు సెక్షన్లను ప్రారంభించడం | 0.020 |
| 9. | ఉన్నత పాఠశాలలకు బిల్డింగు గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.050 |
| | (బి) ఎయిడెడ్ | 0.100 |
| 10. | ఉన్నత పాఠశాలలకు ఫర్నీచరు, పరికరాలకుగాను గ్రాంట్లు | |
| | (ఏ) స్థానిక సంస్థలు | 0.100 |
| | (బి) ఎయిడెడ్ | 0 050 |

| | | |
|---|---|---|
| 11. | XI, XII తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు | 0.005 |
| 12. | పౌర శిక్షణ కేంద్రాలు | 0.020 |
| | మొత్తం | 1.715 |

## యూనివర్శిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్శిటీ విద్యాభివృద్ధికోసం ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో రు. 34.64 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరంలో రు. 24.56 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతం ప్రణాళికలో కేటాయించబడింది. అందులో రు. 1.91 లక్షల మొత్తం ఈ క్రింది పథకాల కోసం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ప్రాచ్య కళాశాలలకు గ్రాంట్లు | 0 09 |
| | **క్రొత్త పథకాలు** | |
| 2. | కళాశాలల్లో 3 సం. డిగ్రీకోర్సు ప్రవేశ పెట్టడం | |
| | (ఎ) ప్రభుత్వానివి (ఒక కళాశాల) | 0.66 |
| | (బి) ఎయిడెడ్ (ఒక కళాశాల) | 1 09 |
| 3. | ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలకు వైద్యశాలలు (ఒకటి) | 0.02 |
| 4. | ప్రాచ్య విద్యాకళాశాలలకు గ్రాంట్లు. | 0 05 |
| | మొత్తం | 1.91 |

## ఇతర పథకాలు

ఇతర పథకాల పద్దు క్రింద ఈ జిల్లాలో రు. 0.65 లక్షల మొత్తం కేటాయించబడింది. ఆ పథకాల వివరాలు ఈ క్రింద తెలుపబడ్డాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి., ఏ. సి.సి. ల విస్తరణ | 0.50 |
| | శాల భటుల, గర్లుగైడ్ల ఉద్యమాభివృద్ధి | 0.03 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయతీ, ప్రైవేటు, సహకార, గ్రామసంఘ, స్థానిక సంస్థల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.06 |
| 4. | ఎన్. సి. సి. యూనిట్లుకు ఏరోమోడలింగు, షిప్పుమోడలింగు పరికరాల సరఫరా | 0.01 |
| 5. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు | 0 02 |
| 6. | హిందీ ప్రేమీమండలులకు గ్రంథాలయ గ్రాంటులు | 0.01 |
| 7. | యువజన సంక్షేమ కార్యకలాపాలు | 0.02 |
| | మొత్తం | 0.65 |

## సాంకేతిక విద్య

### ఫుయ్యూరు పాలిటెక్నిక్ అభివృద్ధి

వుయ్యూరులో ఉన్న పాలిటెక్నిక్కును ఈ సంవత్సరంలో విజయవాడకు మార్చి అక్కడ శాశ్వత భవనాలను లేబరేటరీని నిర్మించడానికి, ఇంజనీరింగులో 3 బ్రాంచీలకు అదనపు పరికరాలను కలగచేయడానికి కూడా తలపెట్టబడింది. ఈ సంస్థను విజయవాడకు మార్చడానికి, శాశ్వత భవనాల

నిర్మాణాన్ని ప్రారంభించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.13 లక్షల మొత్తం కేటాయించబడింది. శాశ్వత భవనాల నిర్మాణానికి రు. 12.03 లక్షల మొత్తం ఖర్చవుతుందని అంచనా వేయబడింది. ఈ సంవత్సరంలో సరఫరా చేయబడబోయే పరికరాలకు అయ్యేఖర్చుకు కూడా కొంత పైకం కేటాయించబడింది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, ఇతర వైద్య సంస్థలకు కావలసిన కాంపౌండర్ల కోసం, రెండవ ప్రణాళికా కాలంలో 495 మంది కాంపౌండర్లకు అదనంగా శిక్షణ యివ్వడానికి తలపెట్టబడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, బోధనసౌకర్యంగల ఇతర ఆసుపత్రులలోను గల 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి శిక్షణ ఇవ్వబడుతుంది. ఆ విధంగా 1956-57, 1958-59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇచ్చేటందుకు ఈ సంవత్సరంలో రు. 0.22 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. ఇందులో రు. 0.02 లక్ష మొత్తం, మచిలీపట్టణంలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ ఇవ్వడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో రు. 13.00 లక్షల ఖర్చుతో ఆంధ్రప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అదనపు భవనాలను నిర్మించడం, పరికరాలు సరఫరా చేయడం, సిబ్బందిని నియమించడంవంటి అనేకమైన అభివృద్ధి పనులు వాటికి చేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో జిల్లా ఆసుపత్రుల అభివృద్ధికి గాను రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 1.00 లక్ష మొత్తం మచిలీపట్నంలో ఉన్న జిల్లా ఆసుపత్రి అభివృద్ధికి వినియోగించబడుతుంది.

## తాలూకా కేంద్రాలలో ఉన్న ఆసుపత్రులకు అభివృద్ధి పనులు

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడం ద్వారా ఆంధ్రప్రాంతంలోని తాలూకా ఆసుపత్రుల అభివృద్ధి చేయుటకుగాను రు. 4.71 లక్షల మొత్తం రెండవ ప్రణాళికలోని మొదటి మూడు సంవత్సరాలలో ఖర్చుపెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధి పనుల కోసం ప్రణాళికలో రు. 1.60 లక్షల మొత్తం ఈ సంవత్సరంలో కేటాయించ బడింది. అందులో రు. 0.14 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. పడకల సంఖ్యను పెంచడం ద్వారా ఇంకా కొన్ని తాలూకా ఆసుపత్రులను అభివృద్ధి పరచడానికి, ఇదివరకే తాలూకా ఆసుపత్రులలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి గాను వినియోగించబడుతుంది.

## లోకలు ఫండు ఆసుపత్రులను స్వాధీనం చేసుకోవడం

ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం కోసం రు. 3.95 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.36 లక్ష మొత్తం 1956–59 లలో ప్రభుత్వం స్వాధీనంచేసుకొన్న అవనిగడ్డ, జగ్గయ్యపేట ఆసుపత్రుల నిర్వహణకు, ఈ సంవత్సరంలో కైకలూరు, తిరువూరులలోని లోకలు ఫండు ఆసుపత్రులను స్వాధీనం చేసుకోవడానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక మొదటి 3 సంవత్సరాలలో ఆంధ్రప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ సంవత్సరంలో, ఇదివరకు ప్రారంభించబడిన వాటిని నిర్వహించడమే కాకుండా మరి 4 కేంద్రాలను ప్రారంభించడానికి తలపెట్టబడింది. అందుకోసం 1959–60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.40 లక్ష 1958–59 లో జిల్లా ఆసుపత్రిలో స్థాపించిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికి గాను యీ జిల్లాకు కేటాయించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు

దేశంలోని జనాభా త్వరితంగా పెరుగుతు ఉండడంవల్ల దేశం యొక్క పరిమిత ఆదాయమార్గాలపై అధిక ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఇందువల్ల కుటుంబనియంత్రణకు, జనాభా పెరుగుదలను అరికట్టె సమస్యకు

ప్రాముఖ్యత ఏర్పడింది. ఈ కారణంగా 13 ఆంధ్రలోను, 7 తెలంగాణాలోను-మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు 1957-59 లలో నెలకొల్పబడ్డాయి. ఈ సంవత్సరంలో ఇంతకుముందు నెలకొల్పబడిన కేంద్రాలను నిర్వహించడమే కాకుండా మరొక 15 కేంద్రాలను— ఆంధ్రలో 10 తెలంగాణాలో 5— నెలకొల్పడానికి తలపెట్టబడింది. అందుకోసం 1959-60 ప్రణాళికలో రు. 0.66 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.06 లక్ష మొత్తం, ఈ జిల్లాలో 1958-59 లో ప్రారంభించబడిన మచిలీపట్టణం, విజయవాడ కేంద్రాలను నిర్వహించడమే కాకుండా గుడివాడలో కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని స్థాపించడానికిగాను వినియోగించబడుతుంది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చడానికి గాను బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు స్థాపించబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో ఈ పథకం క్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 1.50 లక్షల మొత్తం, ఇంతకుముందు స్థాపించబడిన కేంద్రాలను కొనసాగించడానికి, 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను క్రొత్తగా నెలకొల్పడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## కుష్ఠురోగ నివారణ

1957-58, 1958-59 సంవత్సరాలలో ప్రారంభించబడిన 4 కుష్ఠురోగ సహాయ కేంద్రాలను కొనసాగించడానికి, మరి రెండు కేంద్రాలను తెరవడానికి గాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంలో రు. 0 50 లక్ష మొత్తం, ఈ జిల్లాలోని కేసరపల్లి కుష్ఠురోగ నివారణ కేంద్రాన్ని కొనసాగించడానికి కేటాయించబడింది.

## క్షయరోగులకు ప్రత్యేక పడకలు

ఈ సంవత్సరంలో ఇంతకుముందు ఏర్పరచిన పడకలను నిర్వహించడమే కాకుండా ఆంధ్రప్రాంతంలో 290 పడకలను ఏర్పరచడానికి కూడా తలపెట్టబడింది అందుకోసం రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.50 లక్ష మొత్తం, మచిలీపట్నంలోని హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో 20 పడకలను ఏర్పాటుచేయడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

## సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకుముందు స్థాపించిన 5 సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలను కొనసాగించడానికి, ఈ సంవత్సరంలో మరో 3 కేంద్రాలను నెలకొల్పడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం, మచిలీపట్టణం హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో సుఖవ్యాధి చికిత్సా కేంద్రాన్ని ప్రారంభించడానికి ఈజిల్లాకు కేటాయించబడింది.

## చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాలు

ఈ సంవత్సరంలో ఈ పథకం కోసం కేటాయించబడిన మొత్తం రు. 0.30 లక్షలోను రు. 0.06 లక్ష మొత్తం మచిలీపట్నంలో ఉన్న జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో చెవి, ముక్కు, గొంతు చికిత్సాలయాన్ని నెలకొల్పడానికి కేటాయించబడింది.

## నేత్ర చికిత్సాలయాలు

1958—59 లో 2 కంటి ఆసుపత్రులు నెలకొల్పబడ్డాయి. ప్రస్తుతం ఉన్న ఆసుపత్రులను నిర్వహించడమే కాకుండా మరో 3 ఆసుపత్రులను నెలకొల్పడానికి కూడా తలపెట్టబడింది. రు. 0.06 లక్ష మొత్తం మచిలీపట్నంలో ఉన్న జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలో ఒక నేత్ర చికిత్సాలయాన్ని నెలకొల్పడానికి గాను వినియోగించబడుతుంది.

# ప్రజారోగ్యం

### దాయాలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో యిండ్లలోనే కాన్పులుజరిగే పద్ధతిని మెరగుపరచటానికి గాను 1956-57 లో యీ శిక్షణ పథకం ప్రారంభించబడింది. నాటు మంత్రసానులు (దాయీలు) పురుళ్ళు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమ వృత్తిని నిర్వహించడానికి గాను వారికి యీ పథకం క్రింద శిక్షణ ఇవ్వబడుతుంది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో 1329 మంది ఈ పథకం క్రింద శిక్షణ కోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఈ పథకం కొనసాగించబడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకోబడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య ప్రణాళికలో కేటాయించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చే

టందుకు ఆ మొత్తంలో 8,800 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించబడతాయి.

### మలేరియా బ్యూరో విస్తరణ

1956—57 లో మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు కొనసాగించబడినాయి. 1957—58 లో మరో 2 యూనిట్లు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958—59 లో కొనసాగించబడ్డాయి. ఈ వ్యాధి రాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చడానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్యక్రమం 1—4—1958 నుండి మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా మార్చబడింది. అదనంగా స్ప్రేయింగు పరికరాలు, డి. డి. టి. ని సరఫరా చేయడం ద్వారా మలేరియా సోకని ప్రాంతాలతో సహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయబడుతుంది. 17 సబ్-యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్యశాఖ రీజినల్ అసిస్టెంటు డైరెక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్పడానికి 1959-60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటా క్రింద రు. 22.99 లక్షల మొత్తం కేటాయించబడింది.

ఇందులో రు. 2.81 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ప్రస్తుతం ఉన్న 2 సబ్-యూనిట్లను కొనసాగించడానికి, 2 హైపో - ఎండమిక్ యూనిట్లను నెలకొల్పడానికి ఈ మొత్తం వినియోగించబడుతుంది.

### బి. సి. జి. టీకాలు

క్షయ నివారణ కోసం, ఒక కేంద్ర పరిపాలన యూనిట్టు, ఆరు ఫీల్డు టీములతో బి. సి. జి. టీకాల ఉద్యమం మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించబడింది. అవి మొదటి మూడు సంవత్సరాలలో కొనసాగించబడ్డాయి. 1959—60 లో ప్రస్తుతం ఉన్న పరిపాలక యూనిట్టును, ఆరుఫీల్డు టీములను కొనసాగించడమే కాకుండా, అదనంగా మూడు ఫీల్డు టీములను స్థాపించడానికి తలపెట్టబడింది. అందుకోసం ప్రణాళికలో రు. 3.70 లక్షల మొత్తంరాజ్య ప్రభుత్వపు వాటా ఖర్చు క్రింద కేటాయించబడింది.

ఈ జిల్లాలో ప్రస్తుతమున్న 6 ఫీల్డుటీములు 3 మాసాలుపాటు పనిచేస్తాయి. అందుకోసం రు. 0.53 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్య విషయాలను తెలియచెప్పేటందుకు గాను 1957–58 లో ప్రజారోగ్యశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించబడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందు కొన్న 11 జీపులను, అంటువ్యాధుల నివారణ గురించి ప్రచారం చేయడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958–59 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి క్రొత్తఢిల్లీలోని కార్యాచరణ సంఘంవారు సమ్మతించలేదు. అయినప్పటికీ 1959-60 లో జిల్లాలలో ప్రస్తుతం ఉన్న 11 జీపులను, 4 వ్యానులను నిర్వహించడానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థను కొనసాగించడానికి, 8 క్రొత్త వ్యానులను కొనడానికి మూడు ప్రచార సంస్థలను నెలకొల్పడానికి రు. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 0.12 లక్ష మొత్తం, ఒక జీపును, ఒక వ్యానును నిర్వహించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

### *పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాలు*

స్థానిక సంస్థల పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల పథకాల ఖర్చు క్రింద ఈ సంవత్సరంలో ఋణ సహాయంగా భారత ప్రభుత్వం వారి నుండి రు. 102.446 లక్షల మొత్తం లభించగలదని ఆశించబడుతున్నది. ఇందులో కేంద్ర ప్రణాళిక క్రింద రు. *82.446 లక్షల మొత్తం, రాజ్య ప్రణాళిక క్రింద రు. 20.00 లక్షల మొత్తం ఇవ్వబడతాయి. ఇందులో రు. 41.570 లక్షల మొత్తం కార్పొరేషన్ పథకాలకు గాను కేటాయించబడింది. మిగిలిన రు. 15.230 లక్షలు ఈ జిల్లాలో ఈ క్రింది పథకాలకు గాను వినియోగించబడుతుంది.

---

*ఇందులో రు. 5.446 లక్షల మొత్తం, యీ పథకం కోసం 1957–58 లో కేటాయించబడిన మొత్తంలో ఖర్చు పెట్టబడకుండా మిగిలిపోయినట్టిది.

| | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | విజయవాడ నీటి సరఫరా అభివృద్ధిపనులు మొదటిదశ, రెండవదశ | 5.940 |
| 2. | విజయవాడ మురుగు పారుదల పథకం మొదటిదశ | 3.500 |
| 3. | జగ్గయ్యపేట నీటి సరఫరా పథకం | 2.000 |
| 4. | గుడివాడ నీటి సరఫరా పథకం | 4.110 |
| | మొత్తం | 15.550 |

## గృహ వసతి

### *మురికిపేటల నిర్మూలన, పాకీవారికి గృహవసతి*

అనారోగ్యకరమైన మురికిపేటలు ఏర్పడకుండా అరికట్టేటందుకుగాను భారతప్రభుత్వంవారు మురికిపేటలలో నివసించే వారికి పునరావాసం కల్పించటంకోసం మురికిపేటల నిర్మూలన పథకాన్ని రూపొందించారు. విజయవాడ పట్టణంలో ఈ పథకాన్ని కొనసాగించడానికి ఈ జిల్లాకు రు. 0.50 లక్ష మొత్తం కేటాయించబడింది. మొత్తం అంచనా ఖర్చులో భారతప్రభుత్వం వారు నూటికి 75 వంతులు ఇస్తారు. అందులో నూటికి 50 వంతులు ఋణం క్రింద, 25 వంతులు సబ్సిడీ క్రింద ఇస్తారు. రాజ్య ప్రభుత్వం మాచింగు గ్రాంటు క్రింద నూటికి 25 వంతులు ఖర్చు భరిస్తుంది.

పై మొత్తానికి తోడుగా, ఈ జిల్లాలోని వీధులు తుడిచేవారికి 14 ఇళ్ళు నిర్మించేటందుకు ప్రణాళికలో రు. 0.43 లక్ష మొత్తం కూడా కేటాయించబడింది. ఇందులో కేంద్ర సహాయం చేరిఉంది.

## పట్టణాలలో గృహవసతి

### *సహకార సంఘాలు*

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించుకోవడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడం ద్వారా పట్టణ ప్రాంతా

లలో నివాసగృహాల కొరతను తీర్చడానికి ఉద్దేశించబడింది. ఈ సంవత్సరంలో ఆంధ్రప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్ల నిర్మాణానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. పై కేటాయింపునుండి రు. 3.00 లక్షల మొత్తం 50 ఇళ్ళ నిర్మాణానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

## కార్మికులు-కార్మిక సంక్షేమం

### *ఉద్యోగ సమాచార సేకరణ*

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే :

1. ఏరకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్న విషయాన్ని ఎంప్లాయిమెంటు అధికారులు యింకాఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వారికి వివరాలను అందచేయడం.
2. విద్యాభ్యాసం పూర్తిచేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్న వారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహా నిచ్చేటందుకు సమాచారాన్ని అందచేయడం.
3. ఉద్యోగసాధక కేంద్రం యొక్క పరిథిలో ఉండే ప్రాంతంలో గాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింపబడే ఇతర ప్రాంతాలలోగాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి పద్ధతులను రూపొందించడం.
4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈ పథకం, 1957-58 లో ఐదు పెద్ద ఉద్యోగసాధక కేంద్రాలలో అమలు పరచబడింది. ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలు. వీటి కేంద్రయూనిట్టు హైదరాబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958-59 లో ఈ పథకం, కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింపచేయబడింది. 1959-60 లో విశాఖపట్నం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం పైన తెలుపబడిన ఎక్స్ఛేంజీలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని

సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి అజ్మాయిషీ క్రింద వుంచడం ద్వారా సెంట్రల్ యూనిట్టును పటిష్ఠం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలో కూడా సిబ్బందిని పెంచడానికి ఉద్దేశించబడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒక్కొక్క గుమాస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యేఖర్చులో కేంద్ర ప్రభుత్వం వారు భరించే రు. 0.47 లక్షకు తోడుగా రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959–60 ప్రణాళికలో 0.31 లక్ష మొత్తం కేటాయించబడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు 0.057 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ బడుతుంది.

## యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు, ఎంప్లాయిమెంటు కౌన్సిలింగు

ఉద్యోగ సేవా సంస్థలు వృత్తి విద్య విషయాలలో సదుపాయాలను కలుగచేయాల్సిన అవసరాన్ని గురించి భారతప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన ట్రైనింగు, ఎంప్లాయిమెంటు ఆర్గనై జేషను కమిటీవారు నొక్కి చెప్పారు. అందువల్ల 1959–60 లో విజయవాడ, గుంటూరు, కర్నూలు లలో మూడు యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు, ఎంప్లాయిమెంటు కౌన్సి లింగు యూనిట్లను స్థాపించడానికి తలపెట్టబడింది. యువజనులు తమ అభిరుచికి, శరీరదారుఢ్యానికి, అర్హతలు మొదలైనవాటికితగ్గ వృత్తిని ఎంచు కోవడంలో తోడ్పడానికి యూత్ ఎంప్లాయిమెంటు సర్వీసు ఉద్దేశించ బడింది వయోజనుల విషయంలో ఈ కార్యాలను నిర్వహించడానికే ఎంప్లాయిమెంటు కౌన్సిలింగు ఉద్దేశించబడింది కేటాయించబడిన మొత్తం రు. 0.135 లక్ష (రాజ్య ప్రభుత్వ వాటా క్రింద రు. 0.05 లక్ష, కేంద్ర ప్రభుత్వపు వాటా క్రింద రు. 0.085 లక్ష)లోను విజయవాడలో ఒక యూనిట్టును నెలకొల్పడానికి ఈ జిల్లాకు రు. 0.045 లక్ష మొత్తం ప్రత్యే కించ బడింది.

## కార్మిక సంక్షేమ కేంద్రాలు

ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.50 లక్షల మొత్తం, ఈ పథకం కోసం కేటాయించబడింది. అందులో రు. 0.19 లక్ష మొత్తం, 1958–59 లో విజయవాడలో స్థాపించబడిన 'ఎ' తైపు కార్మిక సంక్షేమ కేంద్రాన్ని కొనసాగించటానికి కేటాయించబడింది.

## ఉద్యోగుల భీమా పథకం

కార్మికులకు మాత్రమే వైద్య సదుపాయాలను కలగజేసే ఉద్దేశంతో 1955 లో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఈ పథకం అమలు జరుప బడింది. 1957–58 లో భారత ప్రభుత్వం వారి కోరిక మీద, భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడా ఈ పథకం వల్ల కలిగే ప్రయోజనాలను విస్తరింపచేయడానికి ఉద్దేశింపబడింది. కాని ఈ పథకాన్ని ఆ సంవత్సరం అమలు పరచడానికి వీలులేకపోయింది. ఈ పథకం క్రింద వైద్య సౌకర్యాలు 26–1–1959 నుండి రాజ్యంలోని భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడా విస్తరింప చేయబడ్డాయి. పార్ట్‌టైం వైద్యశాలలు చాల వరకు ఫుల్‌టైం వైద్యశాలలుగా మార్చబడ్డాయి. ఈ పథకం కోసం కేటాయించ బడిన రు. 1.80 లక్షలలోను రు. 0.20 లక్ష మొత్తం, ఫుల్‌టైం వైద్య శాలల ఏర్పాటుకు లేక ప్రస్తుతం పార్టుటైం వైద్య శాలలుగా ఉంటున్న వాటిని ఫుల్‌టైం వైద్యశాలలుగా మార్చడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఇందువల్ల భీమా చేసిన కార్మికులకు కుటుంబాలకు కూడ వైద్యసౌక ర్యాన్ని విస్తరింపజేయడానికి వీలుకలుగుతుంది.

## పనివారికి శిక్షణ సౌకర్యాల విస్తరణ

### వుయ్యూరు పారిశ్రామిక శిక్షణ కేంద్రం

ప్రస్తుతం వుయ్యూరులో ఉన్న పారిశ్రామిక శిక్షణ కేంద్రాన్ని ఈ సంవత్సరం విజయవాడకు మార్చడానికి ఉద్దేశించబడింది. 1958–59 మరో 224 సీట్లను అదనంగా చేర్చడం ద్వారా ఈ సంస్థ పరిపూర్ణమైన సంస్థగా పెంపొందించబడింది. ఈ పథకానికి కేంద్ర ప్రభుత్వంవారిచ్చే రు. 2.92 లక్ష లకు అదనంగా 1959–60 ప్రణాళికలో రు. 1.95 లక్షల మొత్తం కేటా యించబడింది. ఇందులో రు. 2.00 లక్షలు విజయవాడలో శాశ్వతభవనాల నిర్మాణానికి, రు. 1.72 లక్షలు పరికరాలు సరఫరా చేయటానికి, రు. 1.15 లక్షలు సిబ్బంది జీతాలు, అత్యవసర ఖర్చులకు వినియోగించ బడతాయి.

### ప్రస్తుతం ఉన్న పారిశ్రామిక శిక్షణ సంస్థలకు పరికరాలు

వర్కుషాపు సౌకర్యాలను మెరుగుపరచే ఉద్దేశంతో కాకినాడ, అనంతపురం, వుయ్యూరులలోని మూడు పారిశ్రామిక శిక్షణ సంస్థలకు

పరికరాలను ఏర్పాటు చేయడం కోసం ఈ పథకం ఉద్దేశిస్తున్నది ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.75 లక్ష మొత్తం కేటాయించబడింది. మొత్తం కేటాయింపులో రాజ్య ప్రభుత్వపు వాటా రు. 0.623 లక్ష. కేంద్ర ప్రభుత్వపు వాటా రు. 1.12 లక్షలు. మొత్తం కేటాయింపులో రు. 0.623 లక్ష జిల్లాలోని సంస్థకోసం వినియోగించబడుతుంది.

# వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డుకులాల సంక్షేమం

## షెడ్యూల్డు కులాలు- షెడ్యూల్డుకులాలకు స్కాలరు షిప్పులు

ఈ పథకం క్రింద హరిజన విద్యార్థులకు, అర్హులైన యితర కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరుషిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి, దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రు. 1,500/-లు, కళాశాల విద్యార్థుల విషయంలో రు. 1,800/-లు మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరం లేకుండా మాఫీ చేయబడుతుంది. 1959-60 లో, ఇదివరకు మంజూరు చేసిన స్కాలరు షిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరుషిప్పులను మంజూరు చేయడానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకు కూడా స్కాలరు షిప్పులు ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాల వారికి సబ్సిడైజుడు హాస్టళ్లు

ఆంధ్రప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రు. 150 చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు పటా ఇవ్వబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయడానికి రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్ళకు కూడా ఇవ్వబడతాయి.

## షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్ళు

1959-60 లో 5,173 మంది అదనపు విద్యార్థుల సౌకర్యార్థం ఆంధ్రప్రాంతానికి రు. 6.93 లక్షల మొత్తం కేటాయించబడింది. (పాత

హాస్టళ్ళ నిర్వహణకు రు. 1.589 లక్షలు, సబ్సిడీ పొందే హాస్టళ్ళను ప్రభుత్వ హాస్టళ్ళుగా మార్చడానికి రు. 5.341 లక్షలు ప్రత్యేకించబడ్డాయి.) ఈ జిల్లాలోని డోకిపర్రు హాస్టలు రు. 0.10 లక్ష వ్యయంతో నిర్వహించబడు తుంది. సబ్సిడీ పొందే హాస్టళ్ళను ప్రభుత్వ హాస్టళ్ళుగా మార్చడం కూడా జరుగుతుంది.

## పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మత్తులు

ఆంధ్రప్రాంతంలోని సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ ఆజ్మాయిషీ క్రిందగల సబ్సిడీ పొందే హాస్టళ్ళు అద్దె భవనాలలో నెలకొల్పబడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడీ పొందే హాస్టళ్ళకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్టబడింది. 1959-60 లో 25 పాఠశాల భవనాల నిర్మాణం కోసం రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో 2 భవనాలు రు. 0 09 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో నిర్మించ బడతాయి.

## పారిశుధ్య సౌకర్యాలు

సాధారణంగా అనారోగ్యకరమైన వాతావరణంలో ఉండే హరిజన వాడలను ఆరోగ్యకరంగా చేయడానికిగాను కాలిబాటలు, పాయి ఖానాలు, స్నానాలగదులు, మంచినీటి బావులు, మొదలైన పారిశుధ్య సౌకర్యాలను ఏర్పాటు చేయడం అవసరం. 1959-60 లో ఆంధ్రప్రాంతంలో 108 మంచినీటి బావులు త్రవ్వడానికి ప్రణాళికలో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో 10 బావులు, రు. 0.40 లక్ష వ్యయంతో ఈ జిల్లాలో త్రవ్వబడతాయి.

## నివేశన స్థలాల సేకరణ

నివేశన స్థలాలను సేకరించి ఉచితంగా వాటిని హరిజనులకు ఇవ్వడానికి 1959-60 లో ఈ పథకం క్రింద రు. 9.00 లక్షలు కేటాయించబడ్డాయి. అందులో రు. 0 84 లక్ష మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించడానికి 1959-60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. అస్పృశ్యతవల్ల కలిగే నష్టాన్ని గురించి ప్రచారం చేయడానికి, నాటకాలు, యక్షగానాలలో ఉత్తమమైన వాటికి బహుమతులివ్వడానికి, పత్రికలకు సబ్సిడీలకు ఇవ్వడానికి పోస్టర్లను, కరపత్రాలను అచ్చు వేయడానికి, హరిజన దినోత్సవాలు జరువడానికి, వర్ణాంతర భోజనాలను ఏర్పాటు చేయడానికి యీ మొత్తం వినియోగించబడుతుంది. ఈ జిల్లాలో ఈ పథకాన్ని అమలు పరచడంకోసం రు. 0.035 లక్ష మొత్తం కేటాయించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘం, భారత సేవక్ సమాజ్, గిల్డు అఫ్ సర్వీసు, రెడ్ క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు, తదితర స్వచ్ఛంద సంస్థలు అనేకం హరిజనోద్ధరణకు కృషి చేస్తున్నాయి. ఈ సంస్థలకు ఈ విషయంలో తగు ప్రోత్సాహం ఇచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకు రు. 0.60 లక్ష మొత్తం 1959-60 ప్రణాళికలో కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ సహాయాన్ని పొందటానికి అర్హమై ఉంటాయి.

## గృహవసతి

నివేశన స్థలాన్ని ఇచ్చినా కూడా స్వంతంగా ఇళ్ళు కట్టుకోలేనంత బీద స్థితిలో హరిజనులు ఉన్నారు. అందువల్ల, వారు ఇళ్లు కట్టుకోవడానికి సబ్సిడీలను ఋణాలను కూడా మంజూరు చేయడానికి తలపెట్టబడింది. లేబరు, సామాగ్రి మొదలైనవాటి క్రింద ఇవ్వబడే సహాయం కాకుండా ఇంటికి రు. 750/- లు ఇవ్వబడతాయి. అంటే రు. 250/- లు సబ్సిడీ క్రింద, రు. 500/- లు ఋణం క్రింద ఇవ్వబడతాయి. ఈ ఋణం మొత్తం ఈ సహాయం పొందే వారి నుండి వసూలు చేయబడుతుంది ఇతర కులాలవారు కూడా హరిజనులతో కలసిమెలసి ఉండేటట్టు ప్రోత్సహించడానికిగాను నిర్మించేటందుకు తలపెట్టబడిన ఇళ్ళల్లో 10 శాతం వెనుకబడిన తరగతుల వారికి ప్రత్యేకించబడుతున్నాయి. 1959-60 లో ఈ జిల్లాలో 63 ఇళ్ళను నిర్మించేటందుకు ప్రణాళికలో రు. 0.47 లక్ష మొత్తం కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు

వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరు షిప్పులు ఇవ్వడానికి రాజ్యప్రభుత్వం వారు ఏటా సుమారు రు. 4.00 లక్ష మొత్తం ఖర్చు పెడుతున్నారు. ఆంధ్రప్రాంతంలోని అనేక పాఠశాలలలోను, కళాశాలల లోను చదువుతున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా 920 స్కాలరు షిప్పులు మంజూరు చేయడానికి ఈ సంవత్సరంలో రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని వెనుక బడిన తరగతుల విద్యార్థులకు కూడా లభ్యమౌతాయి.

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నతపాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకుంటున్న వెనుక బడిన తరగతుల విద్యార్థులకు సబ్సిడీ పొందుతున్న హాస్టళ్ళలో బోర్డింగు గ్రాంట్లు ఇవ్వబడుతున్నాయి. ఈ గ్రాంట్లు ఒక్కొక్క బోర్డరుకు రు. 150 చొప్పున ప్రతి విద్యాసంవత్సరం ఇవ్వబడుతున్నాయి. 1959—60 లో అదనంగా 445 బోర్డింగు గ్రాంట్లను ఇచ్చేటందుకు గాను ప్రణాళికలో రు. 0.67 లక్ష మొత్తం కేటాయించబడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లా లోని వెనుక బడిన తరగతుల విద్యార్థులకు కూడా లభ్యమౌతాయి.

### వెనుకబడిన తరగతుల వారి పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు

సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో వెనుకబడిన తరగతుల పిల్లలు చేరడాన్ని ప్రోత్సహించేటందుకు రెండవ ప్రణాళిక ప్రారంభం నుండి సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో చదివే పిల్లలకు మధ్యాహ్నపు భోజనాలు ఏర్పాటు చేయబడుతున్నాయి. ఈ విధంగా చేయడం వల్ల అస్పృశ్యతా నిర్మూలనకు కూడా తోడ్పడడం జరుగుతుంది. 1959—60 లో ఈ పథకం కోసం రు. 0.50 లక్ష మొత్తం ఖర్చు పెట్టడానికి తలపెట్టబడింది. ఈ జిల్లా లోని వెనుక బడిన తరగతుల పిల్లలకు కూడ దీనివల్ల లాభం చేకూరుతుంది.

## విముక్తజాతులు

### విద్య

విముక్తజాతులవారి పిల్లలు పాఠశాలలకు పోయి చదువుకోరు. ఇందుకు కారణం వాళ్ళ తల్లిదండ్రులు వాళ్ళను పాఠశాలకు పంపి చదివించలేకపోవడమే. అందువల్ల ఆ పిల్లలకు పుస్తకాలు పలకలు మొదలైనవి ఇవ్వడానికి తలపెట్టబడింది. 1959-60 ప్రణాళికలో రు. 0.09 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ మొత్తంతో చిత్తూరు జిల్లాలోని విముక్త జాతుల వారి కాలనీలలోని 2 పార్కులను, 2 రేడియో సెట్లను నిర్వహించడమే కాకుండా, పుస్తకాలు, పలకలు మొదలైనవి ఇవ్వడం, స్కాలరుషిప్పులను మంజూరు చేయడం జరుగుతుంది. ఈ జిల్లాలోని విముక్తజాతుల పిల్లలకు కూడా ఈ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

### గృహ వసతి

ఈ పథకం క్రింద, విముక్తజాతుల వారు గుడిసెలను వేసుకోవడానికి, ప్రస్తుతం ఉన్న ఇళ్ళను మరమ్మతు చేసుకొనేటందుకుగాను సహాయపడేటందుకు తలపెట్టబడింది. స్వంత ఇళ్ళు కట్టుకునే వారికి రు. 100 వరకు ఖరీదుచేసే సామాగ్రి ఇవ్వబడుతుంది. ఇళ్ళు మరమ్మత్తు చేసుకోవడానికి కుటుంబానికి రు. 30 లు ఇవ్వబడతాయి. 90 క్రొత్త ఇండ్ల నిర్మాణానికి, 90 పాత ఇండ్ల మరమ్మత్తుకు ఈ సంవత్సరం రు. 0.117 లక్ష మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

### ప్రజారోగ్యం

1959-60 ప్రణాళికలో ఈ జిల్లాలో 2 క్రొత్త బావులను త్రవ్వడానికి, 2 పాయిఖానాలను నిర్మించడానికి రు. 0.06 లక్ష మొత్తం కేటాయించ బడింది.

### వ్యవసాయ సహాయం

ఈ పథకం క్రింద, విముక్తజాతుల వారికి ఆర్థికంగా పునరావాసాన్ని కల్పించి వ్యవసాయంచేసుకునేటట్లు చేసేటందుకు వారికి దుక్కిటెద్దులు సరఫరా చేయడానికి, పంపుసెట్లు స్థాపించడానికి పాత బావుల మరమ్మత్తు మొదలైనవి చేయటానికి తలపెట్టబడింది. 1959-60 లో ఈ జిల్లాకు 2 జతల ఎద్దుల్ని సరఫరా చేయడానికి గాను రు. 600/-లు ప్రత్యేకించబడ్డాయి.

### కుటీర పరిశ్రమలు

ఈ పథకం క్రింద విముక్తజాతులవారు, తమ వృత్తులను కొనసాగించుకోనేటందుకు పనిముట్లు, పరికరాలు, ముడి పదార్థాలు, సరఫరా చేయబడతాయి. ప్రతివ్యక్తికి పనిముట్లు, పరికరాలు, ముడిపదార్థాలు రూపంలో రు. 50/- ల వరకు సహాయం ఈయబడుతుంది. దీనికోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష మొత్తం ప్రత్యేకించబడింది. అందులో ఈ జిల్లాకు రు. 1500/-లు కేటాయించబడ్డాయి. ఈ పథకం క్రింద 30 మందికి లాభం చేకూరుతుంది.

### వైద్య సహాయం

వైద్య సహాయం కోసం, తదితర ఖర్చుల కోసం విముక్త జాతులకు చెందిన అర్హులైన 50 మంది రోగులకు రు. 40/- ల చొప్పున డిస్క్రిషనరీ గ్రాంటులను ఈ పథకం క్రింద ఇవ్వడానికి తలపెట్టబడింది. దీనికోసం 1959-60 ప్రణాళికలో రు. 0 02 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో రు. 140/- లు, 6 గురు విముక్త జాతుల వారికి డిస్క్రిషనరీ గ్రాంటులను ఇవ్వడానికిగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడ్డాయి.

## స్త్రీ సంక్షేమం

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యకలాపాలను తీవ్రతరం చేసి, వాటిని ఇంకా ఎక్కువ ఉపయోగకరంగా ఉండేటట్లు చేసే ఉద్దేశంతో దృశ్యశ్రవణ పరికరాలు, సౌండు ప్రొజెక్టరు, ఎడ్యుకేషనల్ చార్టులు, కెమెరాలు, రేడియోలు, సైకిళ్ళు, కుట్టు మిషన్లు తదితర పరికరాలవంటి ముఖ్యమైన వస్తువులను రు. 0.10 లక్ష వ్యయంతో 1959-60 లో ప్రస్తుతమున్న 12 విభాగాలకు సరఫరా చేయడానికి ఉద్దేశింపబడింది. ఆ మొత్తంలో రు. 900/-లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి.

## సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు

ప్రస్తుతం ఉన్న 2 సంక్షేమ ప్రాజెక్టులను నిర్వహించడానికి, ఈ జిల్లాలోని. మొదటిదశ బ్లాకులలో కో-ఆర్డినేటెడ్ పద్ధతిని మరొక ప్రాజెక్టు

ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వ వాటా క్రింద ప్రణాళికలో. ఈ సంవత్సరం రు. 0.386 లక్ష మొత్తం కేటాయించబడింది. ప్రారంభించబోయే ఈ ప్రాజెక్టుకు అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర, సాంఘిక సంక్షేమబోర్డు, రాజ్య ప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజల నుంచి సేకరించే మాచింగు విరాళాలు కూడా ఇందుకు తోడవుతాయి.

### సాంఘిక, నైతిక పునరుద్ధరణ-సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాల నుండి విడుదల చేయబడిన స్త్రీల కోసం ఒక రాజ్యస్థాయి సదనాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 పురుషులకు, 11 స్త్రీలకు) ప్రారంభించడానికి అయ్యే ఖర్చులో రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది. రాజ్యంలో ఇంతకు ముందు ప్రారంభించిన రాజ్యస్థాయి సదనాలు, జిల్లా ఆశ్రయ కేంద్రాలు కూడా కొనసాగించబడతాయి. - పై కేటాయింపు మొత్తంలో రు. 0.153 లక్ష, విజయవాడలో స్త్రీలకోసం ప్రారంభించబడిన ఒక జిల్లా ఆశ్రయ కేంద్రాన్ని కొనసాగించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

### భిక్షుక గృహం

80 మందికి సరిపడే భిక్షుక గృహాన్ని గ్రాంటు ఇన్-ఎయిడ్ పథకం క్రింద రు. 0.40 లక్ష అంచనా ఖర్చుతో 1959-60 లో ప్రారంభించడానికి తలపెట్టబడింది. వారికి ప్రాథమిక విద్య గరపడానికి, చెప్పులు కుట్టడం, వడ్రంగం, నేతపని, దర్జీపని మొదలైనవాటిలో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశించబడింది. దీనిలో భోజన, వైద్య సౌకర్యాలు సమకూర్చబడతాయి.

## మున్సిపలు రోడ్లు, అభివృద్ధి పనులు

మున్సిపాలిటీలు, రెండు పట్టణపంచాయతీలయొక్క ఆదాయ మార్గాలను అభివృద్ధిపరచే ఉద్దేశంతోను, స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలుగచేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షల మొత్తం కేటాయించబడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగచేయడానికి ఈ మొత్తం వినియోగించబడుతుంది. అందులో రు. 21.42 లక్షలు మొదటి మూడుసంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణా

శికలో రు. 11.59 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.15 లక్ష మొత్తం 1958—59 లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించబడు తుంది. మిగిలిన రు. 11.44 లక్షలలోను రు. 1.16 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఋణం మొత్తం, స్థానిక సంస్థపేరు, పని వివరం ఈ దిగువ తెలుపబడ్డాయి.

| స్థానిక సంస్థ పేరు | పని పేరు | అప్పు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| గుడివాడ మున్సిపాలిటీ | క్రయవిక్రయ శాల నిర్మాణం | 0.50 |
| విజయవాడ మున్సిపాలిటీ | మున్సిపల్ ఆఫీసు భవన నిర్మాణం | 0.66 |
| | మొత్తం | 1.16 |

## రేడియో ప్రసారం

### *కమ్యూనిటీ రేడియో సెట్ల స్థాపన, నిర్వహణ*

రెండవ ప్రణాళికా కాలంలో స్థాపించదలచిన 453 కమ్యూనిటీ రేడియో సెట్లలోను, 307 సెట్లు 1956—59 లలో ఈ జిల్లాలో స్థాపించ బడ్డాయి. ఈ సంవత్సరంలో 1—4—1959 కి పూర్వం స్థాపించబడిన సెట్లు అన్నిటినీ నిర్వహించడమే కాకుండా ఈ జిల్లాలో 46 సెట్లను స్థాపించి, నిర్వ హించడానికి తలపెట్టబడింది. ఇందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.353 లక్ష మొత్తం కేటాయించబడింది.

## ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలు పరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణ సహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో

ఎక్కువగా పాల్గొనేటట్లు చేసే టందుకు గాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారం చేయటం కోసం 1956-57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించబడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 21,639/– లు ఈ జిల్లాలో ఈ క్రిందివాటి కోసం వినియోగించబడతాయి.

| | | రూపాయలు లక్షలలో |
|---|---|---|
| 1. | పి. ఏ. ల జీతభత్యాలు, ఇతర సిబ్బంది జీత భత్యాలు | 8,029 |
| 1. | పబ్లిసిటీ వ్యానులకు పెట్రోలు ఖర్చులు, నిర్వహణ ఖర్చులు | 2,400 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనడం | 250 |
| 4. | సంగీత, నాటకోత్సవాలు నిర్వహించడం | 500 |
| 5. | జిల్లా, తాలూకా స్థాయిలలో ప్రచార వారోత్సవాలను జరపడం | 900 |
| 6. | ఈ జిల్లాలో ప్రచారం చేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణ | 4,560 |
| 7. | మొబైల్ వ్యానులకు పరికరాలు | 5,000 |
| | మొత్తం | 21,639 |

## అర్థగణాంక శాఖ

జిల్లా స్థాయిలో రాజ్య ప్రభుత్వానికి చెందిన గణాంక కార్యకలాపాలను సమన్వయపరచి, సేకరించే వివరాల స్థాయిని అభివృద్ధి పరచడానికి ఉపయోగపడే "లయజన్" ఏజన్సీగా పని చేసేటందుకు గాను 1958-59 లో ఒక జిల్లా గణాంకవిభాగం ఈ జిల్లాలో నెలకొల్పబడింది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్ ఒక

అప్పరు డివిజను గుమాస్తా, ఇద్దరు జవాన్లు నియమించబడ్డారు. ఈ సిబ్బంది ఈ సంవత్సరం కూడా కొనసాగించబడుతుంది. ఇందుకు 1959–60 ప్రణాళికలో రు. 0.10 లక్ష మొత్తం కేటాయించబడింది.

## తంతి, తపాలా కార్యాలయాలు

1959–60 లో ఘంటసాల, బంటుమిల్లి, శ్రీకాకుళంలలో 3 టెలిగ్రాఫ్ (కంబైండు) కార్యాలయాలను తెరవడమే కాకుండా 10 పోస్టాఫీసులను కూడా తెరవడానికి ఉద్దేశింపబడింది. పామర్రు, మూనికొండ, నందిగామలలో 3 టెలిఫోను ఎక్స్చేంజీలను, కాజ, అవనిగడ్డ, తిరువూరు, విస్సన్నపేటలలో 3 పబ్లిక్ కాల్ ఆఫీసులను తెరవడానికి కూడ ఉద్దేశింపబడింది.

## రైలు మార్గాలు

1959–60 లో కృష్ణా జిల్లాలో రైలు మార్గాలకు సంబంధించి క్రింది కార్యక్రమం అములుజరుపబడుతుంది.

| వరుస సంఖ్య | పని వివరం | అంచనా వేయబడిన ఖర్చు వేల రూపాయలలో |
|---|---|---|
| 1. | విజయవాడ జంక్షన్ వద్ద అదనంగా గూడ్సు షెడ్డు సౌకర్యాలు కలిగించడం. | 235 |
| 2. | ఈశాన్యలైను—విజయవాడ—మచలీపట్నం సెక్షను-గుడివాడ-భీమవరం లైనును మీటరుగేజి నుండి బ్రాడుగేజికి మార్చడం; విజయవాడ మచలీపట్నం సెక్షను–రెండవ దశ-ప్రస్తుతం ఉన్న దూరం 49.25 మైళ్ళ దూరాన్ని 54.25 మైళ్ళ పొడవుకు మార్చడం. | 29,500 |

# జిల్లా ప్రణాళిక, అభివృద్ధి సంఘం

## సభ్యుల జాబితా

## కృష్ణాజిల్లా

జిల్లా కలెక్టరు, కృష్ణా ... అధ్యక్షుడు
జిల్లా ప్రణాళికాధికారి ... కార్యదర్శి

### అధికార సభ్యులు

1. జిల్లా వ్యవసాయ శాఖాధికారి, విజయవాడ
2. జిల్లా వెటర్నరీ ఆఫీసరు, విజయవాడ
3. జిల్లా వైద్య శాఖాధికారి, కృష్ణా, మచిలీపట్టణం
4. జిల్లా ఆరోగ్య శాఖాధికారి, కృష్ణా, మచిలీపట్టణం
5. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, కృష్ణా సెంట్రల్ డివిజను, విజయవాడ
6. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, కృష్ణా ఈస్టరన్ డివిజను, విజయవాడ
7. విద్యుచ్ఛక్తి డివిజనల్ ఇంజనీరు, విజయవాడ
8. ఇన్‌స్ట్రిక్షన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, గుంటూరు
9. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, స్పెషల్ డివిజను, విజయవాడ
10. పి. డబ్ల్యు. డి. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, నాగార్జునసాగరు కాలువ, అలైన్‌మెంటు డివిజను, నందిగామ
11. జిల్లా విద్యాశాఖాధికారి, తూర్పు కృష్ణా, మచిలీపట్టణం
12. జిల్లా విద్యాశాఖాధికారి, పశ్చిమ కృష్ణా, విజయవాడ
13. జిల్లా పంచాయతీ ఆఫీసరు, కృష్ణా, మచిలీపట్టణం
14. రహదార్ల డివిజనల్ ఇంజనీరు, కృష్ణా, మచిలీపట్టణం
15. ఫిషరీస్ ఇన్‌స్పెక్టరు. మచిలీపట్టణం
16. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, విజయవాడ
17. అసిస్టెంటు స్త్రీ సంక్షేమాధికారి, విజయవాడ
18. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, మచిలీపట్టణం
19. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, విజయవాడ-, (వెస్టు)
20. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, విజయవాడ (ఈస్టు)
21. జిల్లా అటవీ శాఖాధికారి, గుంటూరు

22. జిల్లా ఫైర్ ఆఫీసరు, కృష్ణా
23. జిల్లా సంక్షేమాధికారి, కృష్ణా
24. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, విజయవాడ
25. కృష్ణా జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరు పి. ఏ.
26. జిల్లా పోలీసు సూపరింటెండెంటు, కృష్ణా
27. తపాలా కార్యాలయాల సూపరింటెండెంటు, మచిలీపట్టణం
28. హిందూదేవాదాయ, ధర్మాదాయశాఖ అసిస్టెంటు కమీషనరు, మచిలీపట్టణం
29. సబ్ రీజినల్ ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజి ఆఫీసరు, విజయవాడ
30. సబ్ కలెక్టరు, విజయవాడ
31. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, బందరు
32. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, గుడివాడ
33. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, నూజివీడు
34. ప్లానింగు అసిస్టెంటు ఇంజనీరు, మచిలీపట్టణం
35. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, నూజివీడు
36. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, ముసునూరు
37. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, తిరువూరు
38. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మైలవరం
39. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, వీరవల్లి
40. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, కంచికచెర్ల
41. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, గన్నవరం
42. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, గూడూరు
43. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, కైకలూరు
44. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, బంటుమిల్లి
45. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, అవనిగడ్డ
46. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మోటూరు
47. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, నందిగామ
48. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, విస్సన్నపేట
49. బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మందవల్లి
50. జిల్లా గణాంకాధికారి, కృష్ణా

## స్థానిక సంస్థలు

1. బందరు మున్సిపాలిటీ ఛైర్మను, మచిలీపట్టణం
2. విజయవాడ మున్సిపాలిటి ఛైర్మను, విజయవాడ
3. గుడివాడ మున్సిపాలిటీ ఛైర్మను, గుడివాడ

## లోకసభ సభ్యులు

1. శ్రీ ఎం. వి. కృష్ణారావు, బి. ఏ., తలగడదీవి, దివి తాలూకా
2. శ్రీ డి. బలరామకృష్ణయ్య, గుడివాడ.
3. శ్రీ డా॥ కె. అచ్చమాంబ, విజయవాడ.

## విధానసభ సభ్యులు

1. శ్రీ వై. శివరామప్రసాద్ బహద్దూర్, చల్లపల్లి.
2. శ్రీ ఎం. రాజేశ్వరరావు, బి. ఏ. బి. ఎల్, అడ్వకేటు, లక్ష్మీవారపు పేట, ఏలూరు.
3. శ్రీ ఆర్. అచ్యుతరామయ్య, ఎం. బి., బి. ఎస్., మచిలీపట్టణం.
4. శ్రీ పి. పమిడేశ్వరరావు, మునిపేద, బందరుతాలూకా
5. శ్రీ కె. అప్పారావు, బి. ఏ., కైకలూరు.
6. శ్రీ ఏ. వి. సుబ్రహ్మణ్యేశ్వరరావు, గుడివాడ.
7. శ్రీ వి. కూర్మయ్య, సూర్యారావుపేట, విజయవాడ – 2
8. శ్రీ ఎం. వి. అప్పారావు బహద్దూర్, ఎం. ఏ., నూజివీడు.
9. శ్రీ పి. సుందరయ్య, విజయవాడ.
10. శ్రీ కె. వెంకటరత్నం, అకనూరు, గన్నవరం తాలూకా.
11. శ్రీ ఏ. కాశీశ్వరరావు, గవర్నరుపేట, విజయవాడ – 2.
12. శ్రీ ఎం. చిట్టి. ఉరఫ్ అప్పలస్వామి, కొత్తపేట, విజయవాడ.
13. శ్రీ సిహెచ్. రామకోటయ్య, రొయ్యూరు, మద్దూరు (పోస్టు), కృష్ణాజిల్లా.
14. శ్రీ వి. విశ్వేశ్వరరావు, ప్రజాశక్తినగరు, విజయవాడ.
15. శ్రీ పి. బాపయ్య, దుర్గాపురం, విజయవాడ – 2.
16. శ్రీ ఎం. రామయ్య, జజ్జూరు పోస్టు, నందిగామ తాలూకా
17. శ్రీ పి. వెంకటేశ్వరులు, సూర్యారావుపేట, విజయవాడ.
18 శ్రీ బొడ్డా నరసయ్య, హుజూర్‌నగరు, నల్లగొండజిల్లా.

## విధాన పరిషత్తు సభ్యులు

1. శ్రీమతి ఎం సూర్యావతి, నందమూరు. గన్నవరం తాలూకా.
2. శ్రీ వి. పురుషోత్తం, వినయసదనం, శివాలయంవీధి, సత్యనారాయణ పురం, విజయవాడ—2.
3. కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ఆఫ్ తెలుగు, ఎస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాల, విజయవాడ.
4. శ్రీ జి. సుబ్బరాజు, డిప్యూటీ ఛైర్మను, ఆంధ్ర ప్రదేశ విధాన పరిషత్తు, విజయవాడ.
5. శ్రీ పి. శ్రీరామమూర్తి, బి. కాం., బి. ఇడి., సూర్యారావుపేట, జకింన్ హాంపేట, విజయవాడ—2.
6. శ్రీ జి. బాపనయ్య., నాగయేటితిప్ప, దివితాలూకా.
7. శ్రీ గుత్తారాజారావు, గోడవర్రు, వయా కంకిపాడు, విజయవాడ తాలూకా.
8. శ్రీ జి. బ్రహ్మయ్య, ఘంటసాల, దివితాలూకా.

## ఇతర అనధికారులు

1. శ్రీ ఎం. వెంకటేశ్వరరావు, ఆగిరిపల్లి, నూజివీడు తాలూకా.
2. శ్రీ ఇ. బాలవీరరాఘవయ్య, బి. ఏ. ప్రెసిడెంటు, కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు, విజయవాడ.
3. శ్రీ పోలవరపు మంగయ్య, రాచపట్నం, పంచాయత్ ప్రెసిడెంటు, కైకలూరు తాలూకా.
4. శ్రీ వేముల కేశవరావు, నందిగామ.
5. శ్రీ కొడాలి ఆంజనేయులు, మచిలీపట్టణం.
6. శ్రీ అర్జ రామారావు, మచిలీపట్టణం, భారత సేవక సమాజం జిల్లా కన్వీనరు, తూర్పు కృష్ణా.
7. శ్రీమతి ఎన్. ఎస్. మూర్తి, మచిలీపట్టణం.
8. శ్రీ. అప్పికట్ల జోసఫ్, మాజీ ఎం. పి. విజయవాడ.
9. శ్రీ పాదర్తి వెంకటసుబ్బయ్య, గుంటుపల్లి, విజయవాడ తాలూకా.
10. శ్రీ తుమ్మల వెంకటకృష్ణారావు, కొడాలి, దివితాలూకా.
11. శ్రీ అంకెం వెంకటపల్లి, బి. ఏ. బి. ఎల్., వెనుకబడిన తరగతుల ప్రెసిడెంటు, మచిలీపట్టణం.

12. శ్రీ ఎస్. వి. ఎస్. ప్రసాద్, గుడివాడ.
13. శ్రీ వై. రామమోహనరావు. మేజారు పంచాయతీ ప్రెసిడెంటు. గన్నవరం తాలూకా.
14. శ్రీ పాతులూరి రాఘవయ్య, కోనకంచి (పోస్టు) నందిగామ తాలూకా, భారత సేవక సమాజం జిల్లాకన్వీనరు. పశ్చిమ కృష్ణా
15. శ్రీ నున్నా రామకృష్ణయ్య, తాలూకా కన్వీనరు, భారత సేవక సమాజం, తిరువూరు.
16 శ్రీ ఎల్ పెదకుటుంబరావు, వీరవల్లి, గన్నవరం తాలూకా.
17. శ్రీ ఎస్. ఆర్. వి. నరసింహారావు, మైలవరం.
18. శ్రీ వై. రామబ్రహ్మం, సత్యనారాయణపురం, విజయవాడ.
19. శ్రీ టి. ఎల్. నరసయ్య, చెన్నూరు, బందరుతాలూకా.
20. శ్రీ కట్టా అచ్చయ్య, చేనేత సహకారసంఘం ప్రెసిడెంటు, చింత గుంటు పాలెం, మచిలీపట్టణం.
21. శ్రీ ఎస్. టి. పి. ఎస్. వరదాచారి. నూజివీడు పంచాయతీ సమితి ప్రెసిడెంటు.
22. శ్రీ డి. వెంకటసుబ్బయ్య, ముసునూరు బ్లాకు ప్రణాళిక, అభివృద్ధి సంఘం ఛైర్మను.